





శ్రీరస్తు.

శ్రీ బసవేశ్వరార్పణమస్తు.

# శ్రీ నిజలింగ చిక్కయ్య
## (అను)
# పంచాక్షరీ మహాత్మ్యం.

ఇది

సత్తెనపల్లి తాలూకా క్రోసూరు పోష్టు
వుయ్యందన తాలూకు గ్రామ కాపురస్థులు,
బ్రహ్మశ్రీ పాలపుగు సుబ్బారాయుని
జ్యేష్ఠకుమారుండగు

దేవబ్రహ్మకవిచే

రచియింపబడి,

నర్సారావుపేట రాజ్యగమా ముద్రాక్షరశాలయందు
ముద్రించబడియె.

మొదటికూర్పు 1000.

 [వెల రు 1—0—0.

1931

శ్రీగురుభ్యోనమః.

## —• కవిస్తుతి •—

జలనిధి సంభవించిన వి • షంబును కంఠమునన్ ధరించి యా
కలువల రేనినిన్ దలను • గన్పడ దాల్చిన శంభుకీర్తి నా
దెలిసియు దెల్యనట్టి కడు • క్రీవపుదోషము లుండెనేని మీ
తలపుల త్రోసనుంచి సుకృ • తంబుల వెల్లడి శేయ మ్రొక్కెదన్

## —• కవితాగురుస్తుతి •—

వరపీస్పాటి కులోద్భవుండు కవిత • వ్యాపార కూపారు డీ
శ్వర సంస్తోత్ర పరాయణుండు హరహ • రధ్యాన చిత్తుండు న
న్గురుణన్ సత్కవితా ప్రకల్పకుని గా • గన్ జేసి దీపించు మ
ద్గురు కోటీశ్వర శర్మ నెన్నెద మదిన్ • గోర్కెల్ ప్రసాదింపగన్॥

## —• ఆత్మబోధాగురుస్తుతి •—

గురునా చాత్మార్థంబును
సరిగను బోధించినాతు • సద్గతిజూపిన్
ధరకోళ్ళపూడి సీతమ
నరమర లేకుండ గొల్తు • నాత్మన్భక్తిన్॥

వర వేలూర్పారి కులాబ్ధిచంద్రుని విరా • ట్బ్రహ్మ ప్రభానాటకం
బరయన్ సత్కృతి నందువాని పరత • త్త్వాకార సంవేద్య క
ర్మరుచిధ్వంసుని యస్మదీయ హితు వీ • రబ్రహ్మయోగీంద్రు నే
మరకన్ గొల్చెద నెప్డు నా హృదయ సీమన్ బ్రహ్మయోగంబునన్

## —• విజ్ఞాపన •—

ఆర్యులారా! యిందుగల లోపంబుల ద్వితీయ ముద్రణల
సవరించుకొనగల వాడను.

—• ఇతరకవియభిప్రాయము •—

మ॥ భవదీయాధర తాండవప్రథిత శ • బ్దవ్యాప్త చిక్కయ్యనా
మవిలాసాంధ్ర చరిత్రనాటకము నీ • మంబొప్ప వీక్షించితిన్
భవమోహాం డేరెను నిత్యసంతస సుధా • వారాశిఁ గ్రోలుంచు ది
వ్యవిధిన్ జన్మనొందర్ప పండితవిధే • యా సత్కవిగ్రామణీ॥

ఉయ్యందిన తాళ్ళూరు,
గ్రాంటుస్కూలు
మాష్టరు.

ఇట్లు,
భవదీయాంతరంగికమిత్రుడు
కొప్పరపు గోపాలకృష్ణమూర్తి.

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.



—• పురుషులు •—

కామమోహనుడు—కల్యాణపురాధిపతి.
శంబరుడు—ఎరుకలవాడు
వెంకడు—శంబరుని స్నేహితుడు.
సునందుడు—కామమోహనుని మంత్రి.
భటుడు—
సదాశివయోగి—ముని.
పంతులు—
చిక్కయ్య—కథానాయకుడు.
రంగడు—దొంగలనాయకుడు.
మస్తాన్—ఒక భటుడు.
రాజు—నాగపురాధిపతి.
మంత్రి—డిటో పురమంత్రి.
బసవేశ్వరుడు—అయ్యవారు.
భక్తులు—4గురు
వకీలు—లలితాంగితరఫు.

—• స్త్రీలు •—

కుముదవల్లి—చిక్కయ్యతల్లి
లవంగి—కుముదవల్లి దాసి
దాసి—శంబరుని పండ్లదాసి.
సావిత్రి—కల్యాణపురాధిప మహిషి.
కోమలాంగి—కుముదవల్లి దాసి.
సీమంతిని—వేశ్య.
మరికొందరు వేశ్యలు—
కళింగి—వేశ్యతల్లి.
గౌరి—చిక్కయ్య భార్య.
లలితాంగి—కథానాయకి.

సూ — కాంతా యెందుకింత విచారము. భక్తిరసమే ప్రధానంబుగా జేసి నవరసంబుల నొప్పించుచూ శృంగార రస కథా విధానమున మెలంగిన వీరల మెప్పింపజాలుదువు.

నటి — మనోహరా! అట్టి కథయొకటి లభింపవలయును గదా॥

సూ — మనోహరీ యెందుకులభింపదు. నిజలింగ చిక్కయకథ లేదా।

నటి — నాథా అట్టులైన ఆ కథను వ్రాసిన కవి నామధేయ మేమి?

సూ — మనోహరీ చెప్పెద నాలింపుము॥

శా॥ భావింపన్ ఘనమైన పాలకుగు సు। బ్బారాయు జ్యేష్ఠాత్మజుం
డా విశ్వేశ్వరియున్ విరాట్కృతయు విద్యారోగ్యతన్ గూర్చువా
డా విద్వజ్జన హార్ద్నీయుడు శివ। ధ్యానాత్మతన్ వ్రాసె నా
దేవబ్రహ్మయ నేడు చిక్కయకథన్। దేదీప్యమానంబుగా॥

నటి — ఓహో! మరచితి మరచితి. యీకవి ప్రప్రథమమున వుమామహేశ్వర శతకము వ్రాసియుండెను గదా।

సూ — అవును యీరోజు కార్తిక సోమవారమగుట వలన శివమహిమ ప్రతాపుండును ప్రణవపంచాక్షరి ధ్యాన పారాయణుండునూ అగు నిజలింగ చిక్కయసీసభాస్థారులను చూపించి సంతోషాయత్తచిత్తులం జేసెద. (అని శివధ్యానముగా కీర్తన పాడుచూ నిష్క్రమింతురు)



లవం — (ప్రవేశించి తనలో)

మ॥ ఘననీచంబుల నెన్నకే కలిని రొ • క్కంబింతయున్ గూర్చున
ర్జును డేధీరుడు కీర్తిశాలి జనవ • శ్య ప్రౌఢుడాకీర్ణకం
చనవిద్వత్కవులాశ్ర యింతురదె వే • శ్యల్పూర్ణచంద్రాంశటాం
చనుమోహింతురు హీనవంశ్యుకను చీ • సుల్ జెందరెవ్వారలున్

యిన్నిటికీ ధనమూలమిదంజగత్తనెడి న్యాయంబిపుడు నాకు నిదర్శన మిచ్చుచున్నయది యేమన్న యీశెంబకుం దెదుకుల కులసంజాతుండైననూ కులవృత్తి మొదలగు తొల్లి వ్యాపారంబుల లెక్క లేసరొక్కంబును సంపాదించి వడ్డీవ్యాపారంబున ధనికుండని పేరుజెందుటచే నొక వేశ్య యుంపుడుగత్తెగా నిలచి సమస్తభోగములనుభవించుచుండె వడ్డీరొక్కంబునకై పెద్దపెద్దలనేకులు వానిమేడచుట్టూ దిరుగుచుందురు వారుపేరననేటికి? నా యేలికైన కామమోహన మహారాజుగారు గ్రామంబున లేకుండుటచే నాకుమారుని పెండ్లికి రొక్కమవసరముండి యీశెంబకు నాశ్రయింప నేనునూ బోవనుద్దేశపడుచుంటిని. అయిననూ నా దార పానియగు కుముదవల్లిని యడిగి పోవలయును గదా. ఆమె యీవనమందెచ్చటనున్నయదో తెలియకున్నయది. (అని అటూనిటూ పరికించి) అదిగో ఆసరోవర సమీపంబునగల పూపొదరింట శయనించి యున్నయది సమీపించెదగాక (అని సమీపించును)

కుము — (కలవరింపు) హా మదనమోహనాకారా నీవెవండవో దెలియ బలుకుము, నీవిట కేతెంచుటకు కారణమేమి (అని యూరకుండును)

లవం — (తనలో) యీవనితామణి కలవరింపుచూ యెవనినిజూచియో హా మదనమోహనాకారా యని బలుకుచున్నయది. యిటు కేవిషయములు బయల్దేరునో ఆలకించెదగాక (అని ఆలకించును)

కుము — (కలవరింపు) యేమీ యెరుకులకుల సంజాతుండవా! నాపై మోహమూనివచ్చియుంటివా! నీవెంత ధనవంతుడవైననూ నీవెంన

చక్కనివాఁడవైనను కులహీనుండవుగదా! నేను మహారాజుగారి
భార్యనుగదా! నన్నెట్లు మోహింపఁగలిగితివి (అని యూరకుండును)

లవం — (తనలో) ఓహో యీమెస్వప్నమొక మదనకదన రంగముగా
మారఁబోవుచున్నయది కానిమ్ము యీస్వప్నగత పూరుషుండు మొగు
కలవాఁడనియూ ధనవంతుఁడనియూ చక్కనివాఁడనియూ తేలినది.
(అని ఆలకించుచుండును.)

కుము — (కలవరింపులో నవ్వుచూ) ఆ యేమనుచుంటివి మదనతాప
జ్వర. పీడితు లెచ్చుతగ్గులాలోచింపరనుచుంటివా (అని కొంచెమాగి)
ఆఁఆఁ అట్లాగునా. నిర్భయముగా నాపైఁబడనుంకించెద వేల నీచే
చిక్కినదాననే నట కేగెదను తీవరింపకుము. నీనామధేయమేమియో
తెలిపెమ్ము ( అని కొంచెమాగి ) ఆహా యేమనుచుంటివి. పూర్వ
జన్మంబున నాతో వైరంబూని నను సంహారంబొనరించి యీజన్మం
బున కామరూపివై నీలోడాగిన మదనుని కదనరంగంబున మద
మడంప నేతెంచిన శంబరనామధేయుండనని వక్కాణించి చెక్కిలి
నొక్కి ముద్దాడి యిష్టరతుల కుద్యమింపుచుంటివా ఇఁక నియిష్టము
ఆఁడదాననే నేమిచేయఁగలను. కాని లవంగివచ్చునేమో దానిని నూ
త్రము కనిపెట్టియుండుము దానికీ విషయము దృగ్గోచరమైనచో
నిన్నును నన్నును నిలువున బ్రాణంబులు దీయించును (అని కొంచె
మాగును.)

లవం — (తనలో) ఓహో నేననుకొనినట్లు యీమె యిప్పుడే స్వప్నా
రణ్య భాగమున మదనకేళీ సరోవరకోలాహల జలకమాడుచున్న
యది. కానిమ్ము యీమె స్వప్నగత పురుషుండెవ్వఁడనవాక్యంబున
నే నాశ్రయింపఁదలంచుచున్న శంబరుఁడేయని తేలినది. యీమెకీ
కలవచ్చుటకు కారణము మొన్నసాయంకాలము మేమిద్దరము మేడ
పై యంతస్తునవిహరింపుచుండఁగా అలంకారసంపూర్ణుఁడై తెల్లనిగుఱ్ఱ

వెక్కి మెల్లగా బజారునమీకారు పోవు శంబరునిగాంచిమోహించి అ
తనివిషయమాధ్యంతంబును నావలనదెలుసుకొనిపరితపించుట యె
ల్లైనను వీరిద్దరికిదాంపత్యమొనగూర్చి లెఖ్ఖలేనిరొఖ్ఖంబును రాదీ
యుటకిదియేమంచి సమయముగానున్నయది. (అనిఆమెనుపీక్షించి)
యీామెమెలుకువజెందుచున్నట్లున్నయది కనుమరుగుగా యీాపొద
చాటునదాగెదగాక (అనిమాటునదాగును.)

కు:ము — (కనులుదెరచి లేవబోవుచు),

మ॥ ననుసి యిష్టమువచ్చినట్లు సుమబా • ణాపౌ్రిఢశ్రేణిన
స్కనుగావించి సుఖంచిమామకహి • తేశ్వర్దీర్ప కిష్టైజనక
జనుసేన్యాయమె మోహనాంగనినున • స్మతొ్క గలింబట్టి పీ
డనికెక్లైగెదు చాలుచాలుననుగెం • టన్నాలవిఘ్నట్టునర్॥
(అనిలేచి అటగలకదరీ తిరుప్రంగొగలించి వెలవెలబోయితనలో)

మ॥ జ్వాలతాగ్ని ప్రతిమానమానసభ • వాస్త్రప్ర్యూహముంజిక్కచం
చలలీరీతి చలించుచుందురపహ • స్యంబంచుయోచింపకీ
కలలోవచ్చిన వాడెపీడనెడిగాం • త్రివృక్షమున్నుర్ఖర
త్కలితాలింగన మాచరించితినివిం • తల్గానె చిత్తభ్రమల్॥
అయ్యోయీావిషయ మెవ్వరైననుగనిరేని అపహాస్యాను కూలం
బానుగదా (అనియటునటుజూచును.)

లవం— (సమీాపించి)అమ్మా త్వదీయదర్శనాభిలాషినై అంతఃపురమం
తయూ వెదకివెదకి వేసారి యిటువచ్చితిని వంటరిగా మీాిటనేలజ
రింపుచుంటిరి.

కుము— (నిట్టూర్పుతో కూర్చుండును)

లవం— (సమీాపమునకూర్చుండి) అమ్మా నాతో జెప్పక యీావనంబున
నొంటరిగా నేగుదెంచి.

మ॥ కరివాహంబుల బాయువారు ప్రభుశీ ♦ తుర్గాబాంధువారత్రో
త్తరదివ్యార్థములంగువారు మరుభా ♦ ధన్యిక్కు-వారాళ్ళ భ
ర్తరతిన్ వీడినవారు నుస్సురని చిం ♦ తల్గూలు నట్టీవు ధై
ర్య రుచిధ్వంసత గుందుచుంటివి విచా ♦ రగ్రస్తచిత్తంబునన్॥
యీవిచారము నకు గారణమేమియో మనస్సంకోచము లేకుండా
చక్కగా వచింపుము నాయెడల నీకేమి సంశయము.

కుము — (తనలో) నాస్వప్నవిషయ మీపాదమూటునడగి యీలవంగి
కనిపెట్టినదా యేమి అయిననూ యీప్రియదాసి నాయాజ్ఞ నన్యధా
చరించ వదిగాదు. యేవిషయమైననూ చెప్పుట కభ్యంతరముండదు.
(ప్రకాశముగా) చెలీ నేను కృశించి నీకనులకంత హీనస్థితిలోనగు
పడుచుంటినా! అనసట్టె నన్నవహేలంబు గానను చుంటివేమి.

లవం — నేననుటయేమి నీశుష్కాకారమే సూచించుచున్నయది.

కుము — (చిరునవ్వుతో) అటులనా నాయాకారము సూచించున దేది
యో చెప్పగలవా.

లవం — తమసెలవైనచో నాశక్తికొలది చెప్పెదను.

కుము — చెప్పుము.

లవం — తల్లీ నీవిషయము నేనే చెప్పవలయునా నీవు నిజముగా చక్కని
దానవే యెట్లన్న

సీ॥ నీదేహకాంతుల ♦ నిగ్గుదేలదలంచి
కనకంబుపుటముల ♦ గరగుచుండె
నీమోము సరిబోల ♦ నీరజారాతి
బలుమారు సంపూర్ణ ♦ కళలగాంచు
నీనేత్రములసాటి ♦ నీరజంబులుదూగ
దివిరియు నీటిలో ♦ దేలుచుండె
నీగానుకెనగాగ ♦ నాగారిసముదయం
బచలప్రదేశమం ♦ దలరుచుండె

గీ॥ నారి నీజగన్మోహనా • కారమబ్జ
భవుడు సృష్టిజేసి తగిన • భర్తను సమ
కూర్చడింతకన్నను లేది • ఘోరచింత
అదియె నీమానసంబున • నావరించె॥

ఇట్లు చింతానిమగ్నవై విముక్తిగానక నొంటిపాటున కృశింప నేల మనయంతఃపురమున కేగుదము రమ్ము. దీనికొక్క సదుపాయంబూహించెద.

కుము — ప్రాణసఖీ! నిజమువచించితివి. అంతియే కాదు నీకపదాపరం బేటికి నేనిట కేగుదెంచి యీపొదరింట శయనించి నిద్రించుచూ.

మ॥ వనజాతాస్త్ర సమానుడొక్కరుడు స్వ • ప్నంబందు నేతెంచి న
న్ననికామాతురుడై రతిన్గవసి పి • కన్ ముక్కునాబుద్ధి దీ
రనిదే తాజనె నేమిచెప్పుదును హా • రంబయ్యె నీమోహవా
ర్ధిని దాటన్ సమకట్టుటెట్లు తెరవే • దీపెల్పవే మ్రొక్కెదన్॥

(అని మ్రొక్కబోవును.)

లవం — (ఆతురముతో చేతులుబట్టుకొని లేవదీసి)

ఉ॥ దాసితనంబునన్దనరు • దానను నాదొరసానివీవు నీ
దోసిలికైకొనన్దగదు • దోసిలియొగ్గెద నూరుసార్లు నీ
వాసిదొలంగువిన్నపెర • వారలునవ్వుదురాత్మభర్త పె
న్గాశినొనర్చునైనహిత • కార్యముదీర్చసి దాసిదాసియే॥

కానిమ్ము నీయిష్టమే నెరుగుదును. యీకార్యంబవార్యముగా దీర్చెద. నీమనోసంకోశం బిసనాడి మన అంతఃపురమున కేగుదము రమ్ము. అవల కార్యంబాలోచించెద.

కుము — కాంతా నావిషయ మెరింగినను, నాకలనేతెంచు పురుషు నెరుంగుదువా.

లవం — ఆయెందు నెరుంగను. ఆతండెవ్వడన్న.

ఉ॥ అంబుల వేట కాదు మొగ ॥ మందము గాగలవాడు పెక్కు రా
క్కంబులు గల్గువాడు వగ ॥ కాదు కలంగను హస్తవాడు ప్రే
ర్యం బరుడన్యవంశ్యుడు బ ॥ జారున మొన్న తురంగ మెక్కె ని
క్కంబుగ నేగువాడతడె ॥ కాముగూర్చిన వాడు తెల్లిరో॥

యెట్టులయినను నీయాజ్ఞ శిరసావహించుచుంటి నిక రాబోవు యిక్కట్టులకెల్ల నేమూ బాధ్యులమయ్యెదము గాక అన్నిటికి పరమేశ్వరుండే కలడు (అని నిష్క్రమింతురు)

—॥ శంబరుని మేడ ॥—

శంబ — (తూలుచు ప్రవేశించి) వోరోరెంకటిగా యింత సేపైనా రా
వేంటిరా రా రా (అని తూలుచుండును)

వెం — (ప్రవేశించి) దొరోదండాలు దండాలు యేం శెలవిత్తారు.

శం — వోరే యెంకటిగా యియ్యాళ యీపొద్దైతేను

మ॥ పదిముంతల్ కొలకల్లు ద్రావితిని శా ॥ బాసావ్వహ్వా రెపెగ్గకే
బదిసారాయిగిలాసు బుచ్చితిని కై ॥ పాలేదు గంజాయిబు
ఱ్ఱ కూరక బీకెద నాల్గు గుక్కె (అని గంజాయి పీల్చి)

మ॥ లవ్వురా రా చూడ్ని సామొక్కె (అని తమాషజూపి) భే "
మదిరా చూచితిరా భ్రమించితినిరా ॥ చక్కని ముద్దాస్తరా॥

(అని కీర్తన బాడుచు నృత్యము చేయుచుండును.)

(2వ అనుబంధము.)

లవం — (తెరలో) యీ యింటిలో నెవరున్నారు (అని కేక వేయును)

శంబ — (ఆలకించి) అరే యెంకటిగా యేరో పిలుస్తున్నారురా! యీవు
పోయి ఆ అమ్మోర్ని తీసుకొనిరాపోరా (అని కూర్చుండును)

వెంక — చిత్తంపభో (అని పోయి లవంగితో ప్రవేశించును)

శంబ — లేచి లవంగినిచూచి) దండం దండం అమ్మోరు పంపించాదా
యేంస్ది, నన్ను తీసుకెల్తావా యేస్ది, ఆమెగారు నన్ను భమించాదా

యేఁస్త్రీ నేనచలే చక్కణోణ్ణిలే చెప్పుచెప్పు పోదాంపదా (అని పోబోవును)

లవం — (తనలో) వీడికి మమకారము మాతునకెక్క కామాంధకారము కనులకుదిగింది గాబోలు స్పృహదప్పి మాటలాడుచున్నవాడు యిది యేనాయిష్టమైనంత డబ్బులాగుటకు సమయము (అని ప్రకాశముగా) శంబరా అమ్మోరెవరు నిన్ను భ్రమించుటేమిటి యెక్కడికి మనము పోవ్రట. త్వరపడక అవిషయమేమిటో కొంచెము చెప్పుము.

శంబ — (నిట్టూర్పుతో కూలబడి) అయ్యో లవంగమ్మోరు. ఆచంగతి నీకుతెల్దా చెప్తాయిను నేన్నొన్న తెల్లగుర్రాన్నెక్కి చోకేసుకొని బజార్న చికార్గాపోతూపోతూ మేడమీద నీసర్చునకూర్చున్న అమ్మోర్ని యిట్టాచూచా చూచేవరకు (అనిముక్కుతో) అమ్మో చెప్పలేను చెప్పలేను. (అని కండ్లు తుడచుకొనును)

లవం — శంబరా యెంతకిట్లేడ్చెదవు పాపమూరకొనుము. అట్లు చూచేవరకేమి జరిగినది.

శంబ — లవంగమ్మోరూ దయగలతల్లీ నాపాణంపోతుంది రచ్చించాల రచ్చించాల అమ్మోర్ని యిట్టాచూచా చూచేవరకు ఆమెచక్కదనమంతా తళుక్కున మెర్పాలమెర్చి నాకండ్లల్లోదూరాది కండ్లుమూ చకపోయ్యాయి కన్నుల్లో యేందో దిగులుపుట్టాది. గుర్రంమ్మీద నుంచి పడపోయ్యా పడపోయేమొనగాడ్ని గాబట్టిపట్టుకొని కుదుగ్గా కూచ్చున్నేవరకు దొరోరి బటులొచ్చి మాదేపిడికా దుండడానికి యీల్లేదని తరిమేశారు. అంతట దికాల్పోయి యింటికొచ్చాను. వచ్చానేకానీ దిగులెచ్చాది. బువ్వ దిందామంటే యిట్టాకాదు. కూర్కురాదు. నాపానంపోతుందిలవంగమ్మోరూరచ్చించురచ్చించు (అని మ్రొక్కును).

లవం — (తనలో) యీతనికింకా భ్రమకల్పించి అతిపిచ్చిలోపడవేసి

నాకార్యముదీర్చుకొనెదగాక (అనిప్రకాశముగా) శంబరాఅమెగారి నిమాచినీవు భ్రమించుటేమిలెక్క గోచులువిగించిన గోసాయిలె యీమెనుజూచి మోహించి నిలువలేక అరణ్యములలోపిచ్చివార లైదిరుగుచున్నవారు సరేకాని మొన్నకూడుదిన నిష్టములేకున్న సి న్నైనాదినియుంటినాలేదా!

శంబ — యెబ్బే బువ్వెక్కడదాగాను లేదులేదు కానీ లవంగమ్మోగొ నిన్నొక్కతమాసజరిగాది॥

లవం — శంబరా యేమితమాష జరిగినదో చెప్పుము.

శంబ — చెప్తానులవంగమ్మోరు నిన్నంత పొద్దెక్కసతర్వాత యీపక్తె ముంచంమీదపండుకొనినిద్రపొయ్యాను పొద్దోయ్యవరకు అమ్మోరువ చ్చినన్ను మోయించాది కలగామూల అది లవంగమ్మోరు యేమిచె ప్పేదు యేమిచెప్పాను (అనిదుఃఖించును.)

లవం — శంబరా యెందుకట్లుదుఃఖించెదవు శాంతిపడుమూనలేమి జరిగినది.

శంబ — యేమిజరిగింది మేమిద్దరమిట్టాకొట్టిగా యుంటావుండగ యెవ రోవచ్చిపిలిచారు పిలిచేవరకు కండ్లుతెర్చాను అమ్మోరులేదు యే మిలేదు లవంగమ్మోరు యిదిసప్పమేనా॥

లవం — (చిరునవ్వుతో) శంబరా యిది స్వప్నముగాక మరేమిటి స్వప్నమే

శంబ — అదేకామూల లవంగమ్మోరు ఆపొద్దుకాడనుంచి కన్నులో గు బులుపుట్టి పైపానంపైనేపోతుంది నీకుకావల్సినంతడబ్బిత్తా ఆఅ మ్మోర్ని నాకిప్పించాల నాపానంరచ్చించాల నీపాదాలకు మొక్కు తాలవంగమ్మోరు (అనిమ్రొక్కును)

లవం — (తనలో) యీశేదునాజాలునకేవచ్చినాడు యేయుక్తి చేసైనా ముందుడబ్బులాగుకొనుటయే యుత్తమము (అనిప్రకాశముగా) శం

బరా యేమనుచుంటివి అమ్మోరినినీకిప్పించాల్నా అమ్మోరినేకాదు రాజుగారితో జెప్పి రాజ్యమునుగూడా యిప్పిస్తానేలుకో నేనునీయింటికివచ్చినందులకా నీవీమాటలు మాట్లాడినది. చాలుచాలు అమ్మోరన్న నీకంత చుల్కనగా కనుపడుచున్నదా. కానిమ్ములే నేను పోవుచున్నాను (అని పోబోవును)

శంబ— (తడాల్న చెయ్యిబట్టుకొని) లవంగమ్మోరూ నేనన్నిచంగతులు చెప్పినదాక వూరుకొని యిప్పుడీచంగతులన్నీ దొరోటతో చెపుతానని పోతున్నావ నాపాణంతీయిత్తావ నీకేమొత్తుంది (అని వెంకటిగాడ్నిచూచి) అరే యెంకటిగా అగూట్లో యెయ్యి రూపాయీల సంచి తీచుకొని రాపోరా అమ్మోరికిత్తాము.

వెంక— చిత్తం (అని పోయి తెచ్చియిచ్చును)

శంబ— (అందుకొని) లవంగమ్మోరు యీ దబ్బుతీచుకొని నంనొగ్గిచ్చాల నాయిట్టుందిర్చాల నీకాళ్లకు మొక్కుతా (అని సంచినిచ్చి కాళ్లమీదబడును.)

లవం— (సంచినందుకొని) శంబరా యికిలెమ్ము యెంత పిచ్చివాడవు యింతేతొందరించిన యేకార్యమైనా గిట్టుబాటౌనా ఆమె యెవరనుకొంటివి మహారాజుగారిభార్యగాదా! ఆమె కేదైనా కోపము గలిగించితిమేని మనయిద్దరి పాణములు దక్కుననుకొంటివా. యెట్లో తగినట్లు బోధజేసి నీమీద భ్రాంతిగలిగించెదను కాని యీదబ్బుతోనే యింతపని చేయువలయునా, యింకేమైనా ఆశయున్నదా లేదా.

శంబ— లేకేమి లవంగమ్మోరూ అమ్మోరికీ నాకూ మోచంలేకుండా కుదిరిచ్చావంటె యింకొక్కసంచియిత్తానమ్మోరు నేమాటదప్పనమ్మోరు (అని కాళ్లమీద పడబోవును)

లవం— శంబరా నేనుండగానీకేమిభయము. యీరాడిలమ్ము యింకొక్క

సంగతి నాకివ్వవలశిన వెయ్యిరూపాయీల సంబి రేపుదయమున నే యిచ్చినయడల నీకార్యముగట్టెక్కించెద యోచించుకొనుము సరే కాని యీమనిషిని నావెంట మాయింటిదనుక పంపించెదవా.

శంబ— లవంగమ్మోరు అటులనేపంపిత్త. తెక్కినడబ్బు తెల్లారకముస్సే యీయెంకడిగాడ్తో పంపిత్తా కానీ నామాట గెలిపిచ్చాల సివెప్పు డేది చెప్తె నీయాగ్గేమరకుండా ఆపని చేసితీరతాను. యిదుగో యిం దుకు బాచయిత్తాను తీసుకో (అని చేతిలో వెయ్యివేసును)

లవం—(సంతోషముతో) శంబరా యిదిమొదలూ నేనెప్పుడే కబురు పెట్టుదున్ ఆకబురు ప్రకారము సంచరించుచుండుము నేనుపోయి వచ్చెద (అని నిష్క్రమించును)

శంబ—లవంగమ్మోరు నాపాణం రచ్చించాల రచ్చించాల (అనునంత లో తెరబడును)

కుముదవల్లి మేడ.

కుము—(జిజ్ఞాసతో)

చం॥ తిపమున కేగినట్టి వసు • ధాధపుడింటికివచ్చుచుండె నా
యపకృతినంతయుగ దెలశి • పాకతినంబగు శిక్షగూర్చునో
యుపయశమంచు వీడునెమ • పాటవిపాలొనరించునో యిసీ
యిపుడొనరించనేది పర • మేశ్వర శ్రీ మనుమాయుపేశ్వరా॥
వాహాతవిధీయెంతవిపరీతము.

చం॥ యెరుకలవాడు వాడు పృధి • వీశ్వరురాణిని నేను నాకు వా
డరయగమోహనుండగుచు • నక్షులకుంగను పట్టుబెట్టులా
స్మరుశదనంబహేయముగ • నల్పుటయెట్లు లలాటమందు నీ
పగణిని వ్రాసినావె తిపిజ • గంబునదుర్యశమంద నాక హా॥
(అని విచారముతో కూర్చొనియుండును)

లవం—(ప్రవేశించితనలో) నా యేలికసానియెందులకో విచారపడుచు

న్నయాది. (అని సమీపించి)

కం॥ నా యేలిక సామీ నీ
ప్రియుఁడ దిక్కనుపడు ॥ హేతువ యేమీ
నాయెడ మర్మము నుంచక
తాయిగ వచియింపు మక్క ॥ తావిను దేనుఁ॥

కుసు— ప్రియసఖీ నీయెడ మర్మభావముంచుదాననా, అల్లించకు ఈరోజు సాయంత్రమునకు రాజుగారిటకు వచ్చునట యీసంగతి యెవ్వరైనా చెప్పినగాని మనగతి యేమియగునో యని విచారింపుచుంటిని॥

లవం— తల్లీ రాజుగారితో మనసంగతి చెప్పువారుండరు వొకవేళ నీచవతులలో నెవ్వరైనా చెప్పినగాని గిట్టక చెప్పినారని నమ్మనే నమ్మను నమ్మినగాక అప్పటి కేదయో పన్నాగము కన్నకుందుము నీవు వరకు తగుజాగ్రతగా చరింపుచుండుము. (అవల యోచించును)

కుసు— లవంగీ మనవ్రాతగతు లెట్లున్నవో యెఱుంగజాలముగదా కానిమ్ము మనమతిజాగ్రతతోనె ప్రవర్తింపవలయును. తదుపరి భగవంతుడే కలడు. (తనలో) ఈసాయంకాల మెద్విధమునైనా శంబరుని కడకేగి ఈరోజు మొదలు మనుపవనంబున కెప్పుడూ రావద్దని గట్టిగా చెప్పుటయే ప్రథమోపాయము.

(తెరబడును)

ప్రథమాంకము సమాప్తము.



శ్రీరస్తు.

# నిజలింగచిక్కయ్య

## ద్వితీయాంకము.

( రాజసభ కామమోహన మహారాజు సునందుడను మంత్రి సక
భటులు పండ్లతట్టతో నొకదాసీ యుండగా తెరలేచును. )

కామ — సేనకా ఆఫలములమధ్యగల చూతఫలమిట్లు తెమ్ము

సేన — చిత్తము. (అని ఆఫలము తీసుకొని యిచ్చును)

కామ — (అందుకొని) సచివాగ్రణీ యీఫలమెక్కడిదో యెఱుంగుదువా.

సునం — రాజశేఖరా నేనెఱుంగను తమరెఱుంగుదురా.

కామ — యెఱుంగను. దీనివిషయ మాదాసివలననే తెలియవలయును విచారింపుము.

సునం — చిత్తము (అని దాసీనిజూచి) దాసీ యీఫలమెవ్వరునీకిచ్చిరి.

దాసీ—అయ్యా యీ ఫలములన్నియు యాశోంబరుండు నాకిచ్చి పంపుచుండెను.

సునం — ఆశోంబరు డేకులస్థుడు. యీ ఫలము లెచ్చటికంపుచుండెను.

దాసి — ఆశోంబరుండెరుకల కులస్థుడు ధనవంతుడు తన యుంపుడుకత్తెయగు కనకవల్లియను వేశ్యకడ కంపుచున్నవాడు.

సునం — (ప్రభువువైపు జూచును)

కామ — దాసీ యీఫల మాశోంబరున కెట్లువచ్చినదో చెప్పగలవా.

దాసి — స్వామీ నాకు తెలియదూ చెప్పజాలను.

సునం — చెప్పజాలవా తెలియదా?

దాసి — తెలియదూ చెప్పజాలను.

సునం — (తనలో) యీఫలమెక్కడిదై యుండును. దీనివిషయమై మహారాజుగారికింత పట్టుదలయేటికి యేదియో యొక గొప్పకారణముగా గనుపట్టుచున్నయది. కానిమ్ము కొంచెమోపికపట్టితి నేని దీని యదా

ర్థమంతయూ బయల్పడును. (అని విచారముతో నుండును)

కామ — మంత్రివర్యా యిన్నకంటె వేమి ఆశంబరుం డెవ్వడో యెచ్చటనే పనిమీద నున్ననూ పట్టుకొని వచ్చునట్లు భటుల కాజ్ఞాపింపుము.

సునం — చిత్తము (అని సేవకునిజూచి) సేవకా అతివేగంబుగా నిద్దర కాల్లర బిలచుకొని రమ్ము.

సేవ — చిత్తము (అని తెరలోనికిపోయి యిద్దర కాలర్లతో వచ్చును)

సునం — భటులారా మీరు శంబరుండెచ్చట నేపనిమీద నున్ననూ అతితీవ్రంబుగా నిటకు దోడి తెండు యిది రాజాజ్ఞ।

భటుడు — చిత్తము (అని నిష్క్రమింతురు)

కామ — సేవకా యీదాసీదాని నాగదియందుంచి కాపలాయుండుము. మేము బిలచునంతవరకూ రాకుము.

సేవ — చిత్తము. (అని దాసీనిజూచి) దాసీ పోవుదము పద. (అనినిష్క్రమింతురు.

కామ — అమాత్యశేఖరా యీఫలమెక్కడిదని భావించుచుంటివి నేను మారేడువనములో అన్నపానాదులవర్జించి వాయుభక్షణతో మూడుమాసము లతిఘోరముగా తపంబాచరింప సంతానేశ్వరుండు యతిరూపముతో దర్శనమిచ్చి ప్రసాదించినది. యీచూతఫలమును తిక్కిన వారందరూ వయస్సుమీరిన వారగుటచే చిన్నభార్యయగు కుముదవల్లికి నిన్నయుదయమున నిచ్చితి. ఆఫలము యెరుకలవాని కెట్లు చేరినదో విచారింపవలయును।

సునం — (తనలో) అయ్యో నేననుకొనినట్లు యీవిషయ మతిఘోరస్థితికే దిగుచున్నయది. యింకేమిచేయవలయును. పాపమా కుముదవల్లి కేగతి మూడనున్నదో కదా. (అని విచారముతో కూర్చుండును)

(భటులు శంబరుతో ప్రవేశింతురు.

కామ — సచివవరా యీశంబరుని విచారింపుము.

సునం — చిత్తము (అనిశంబరునిజూచి) నీపేరేమిరా
శంబ — అయ్యా నాపేరుశంబరుడు
సునం — నీకులమేమిరా
శంబ — సామీ నాకులంయెరుకలకులం
సునం — నీకుజీవనాధారంబగు వ్యాపారమేదిరా
శంబ — దొరో మొదట తోళ్లవ్యాపారము పందులవ్యాపారము చేసి చాలాడబ్బుసంపాయించి యిప్పుడువడ్డీవ్యాపారము చేయుచున్నాను
సునం — నీవుపెండ్లిచేసుకొంటివా
శంబ — దొరో పెండ్లిచేసుకున్నాను నాపెండ్లాముచాలామంచిది
సునం — నీపెండ్లాముదేనికిమంచిదిరా
శంబ — సామీ చెప్పినట్టింటదండి
సునం హో రేయెరుకలవాడా నీవొక వేశ్యనుంచితివట నిజమేనా
శంబ — (తనలో) యిదేందో నాకొంపమునిగినదే (అనిబిత్తరచూపులు చూచును
సునం — (భటులవైపుచూచి) వీడేమోబిత్తరిచూపులు చూచుచున్న వాడు పారిపోవునేమో ఖడ్గపాణులై జాగ్రతగానిలువుడు
భటులు — చిత్తము (అనియిరుప్రక్కల ఖడ్గపాణులై నిలచి) శంబరాదొరగారడుగుమాటలకు సరియైనజవాబివక పారిపోజూచితివేని కత్తికొక కండజేబ్బెదము జాగ్రత యివిగో కత్తులజూడుము (అనిఝుళిపింతురు).
శం — (గడగడవడకుచూ) అయ్యో మొక్కుతా సంపకండి నిజముసెపుతానండి సంపకండి ఊం=ఊం=ఊం=(అని యూరకొనును)
సునం — యేమిరాశంబరా నిజముచెప్పిననీకేమి మోసముండదు చెప్పుము.
శంబ — దొరో నిజముచెప్తా నన్నుచంపకండి వుంచుకున్నాను.
సునం — దానిపేరేమిరా!

శంబ— దొరో కనకవల్లి.

సునం= శంబరా మంచిదైన నీభార్యయుండగా దాని సేలయుంచితివిరా.

శంబ— (వడకుచుండును)

భటు— యేమిరా మాట్లాడక బెల్లంగొట్టిన రాయివలె నూరకుండెదవు

(అని మీాదికి పోవుదురు.)

శంబ— (కనుల నీరుదుడచుకొను చుండును)

సునం— శంబరా నీవాకనకవల్లి యింటికి పోవుచుండ నీభార్యయేమన దా

శంబ— దొరో నామాట కెదురాడదండి.

సునం— అందువలననేనా మంచిదనుచుంటివి.

శంబ—దొరో అవునుదొరో।

సునం —శంబరా సరేకాని నీవాకనకవల్లికి ప్రతిదినమూ ఫలములుగాని

తినుబండారమేదైన పంపు మామూలున్నదా।

శంబ— దొరో యెప్పుడైనా పంపుచుందును.

సునం— యీరోజు నేమైనా పంపుచుంటివా.

శంబ— (దిక్కులుచూచుచూ తనలో) అయ్యోయింకేమియుంది నేనను

కొనినట్లు నాకొంపేమునిగింది. ఆకండ్లదాసీ దేమయినా వీరితో చె

ప్పిందాయేం (అని వడకుచుండును)

సునం— (కోపముతో) దురాత్మా చెప్పవేమిరా కత్తికొక కండతీయిం

చవలెనా యేమిరా.

శంబ— దొరో పంపిచ్చా.

సునం— యేమి పంపించావురా.

శంబ— మామిడికాయలు.

సునం— యెవరిచేత.

శంబ— దొరో కనకవల్లి దాసీచేత

సునం— ఆఫలము లెక్కడివిరా.

శంబ- దొరో అమ్మస్తే తీసుకున్నానండి.

సునం- ఖరీదు కా.

శంబ— అవునుదొరో

సునం- యెన్ని

శంబ- దొరో పావలాయిచ్చి తొమ్మిది తీసుకన్నానండి

సునం= దాసితో నెన్ని పంపితివిరా

శంబ —(ఛూరకుంచును)

సునం—యేమిగా మాట్లాడవు.

శంబ—అయ్యా, అయ్య చెపుతా పదికాయలు పంపానండి.

సునం__అరేనీవు కొన్నది తొమ్మిదికాయలుగదా, పదికాయ లెట్లుపంపితివిరా!

శంబ- సామీ ఆకాయలకన్నా మంచికాయవకటి మాయింటిలో నుండగా అదిగల్పి పది జేసి పంపితినిదొరో॥

సునం-- ఆకాయనుగుర్తింప గలుగుదువటరా

శంబ— దొరో గుర్తిత్తా

సునం— (రాజుగారివైపుజూచును)

కామ— (సేవకునిజూచి) సేవకా ఆద్వారమునుబిగించి ఆవండ్లశట్టనిటు తీసుకొనిరమ్ము

సేవ— చిత్తము (అనిద్వారమునుబిగించి ఆవండ్లశట్ట తెచ్చిపెట్టును)

సునం— యిందులోనీవేసినకాయ యేదియో తీసిచూపుము

శంబ— దొరో యిదిగో (అనిమంచికాయతీసియిచ్చును)

సునం— (అందుకొనిరాజుగారివైపుజూచును

కామ —సచివవరా సంకోశిం చెదవేల విచారింపుము

సునం—చిత్తము (అనిశంబరునిచూచి) శంబరాయీఫలము నీవుకొంటివా యెక్కడనైనా తస్కరించితివా

శంబ— దొరో కనకవల్లి.

సునం= శంబరా మంచిదైన నీభార్యయుండగా దాని సేలయుంచితివిరా.

శంబ— (వడకుచుండును)

భటు— యేమిరా మాట్లాడక బెల్లంగొట్టిన రాయివలె నూరకుండెదవు (అని మీాదికి పోవుదురు.)

శంబ— (కనుల నీరుదుడచుకొను చుండును)

సునం— శంబరా నీవాకనకవల్లి యింటికి పోవుచుండ నీభార్య యేమనదా

శంబ— దొరో నామాట కెదురాడదండి.

సునం— అందువలననేనా మంచిదనుచుంటివి.

శంబ—దొరో అవునుదొరో!

సునం —శంబరా సరేకాని నీవాకనకవల్లికి ప్రతిదినమూ ఫలములుగాని తినుబండారమేదైన పంపు మామూలున్నదా!

శంబ— దొరో యెప్పుడైనా పంపుచుందును.

సునం— యీారోజు నేమైనా పంపుచుంటివా.

శంబ— (దిక్కులుచూచుచూ తనలో) అన్యాయింకేమియుంది నేనను కొనినట్లు నాకొంపేమునిగింది. ఆపండ్లదాసీ దేమయినా వీరితో చెప్పిందాయేం (అని వడకుచుండును)

సునం— (కోపముతో) దురాత్మా చెప్పవేమిరా కత్తికోక కండలీయించవలెనా యేమిరా.

శంబ— దొరో పంపిచ్చా.

సునం— యేమి పంపించావురా.

శంబ— మామిడికాయలు.

సునం— యెవరిచేత.

శంబ— దొరో కనకవల్లి దాసీచేత

సునం— ఆఫలము లెక్కడివిరా.

శంబ- దొరో అమ్మస్తే తీసుకున్నానండి.

సునం- ఖరీదుకా.

శంబ— అవునుదొరో

సునం- యెన్ని

శంబ- దొరో పావలాయిచ్చి తొమ్మిది తీసుకన్నానండి

సునం= దాసితో గన్ని పంపితివిరా

శంబ —(పూరకుంకును)

సునం—యేమిరా మాట్లాడవు.

శంబ—అయ్యా, అయ్యా చెపుతా పదికాయలు పంపానండి.

సునం— అనేనీవు కొన్నది తొమ్మిదికాయలుగదా, పదికాయ లెట్లుపంపితివిరా!

శంబ- సామీ ఆ కాయలకన్నా మంచికాయవకటి మాయింటిలో నుండగా అదికల్పి పది జేసి పంపితినిదొరో॥

సునం— ఆ కాయనుగుర్తింప గలుగుదువటరా

శంబ— దొరోగుర్తిత్తా

సునం— (రాజుగారివై పుజూచును)

కామ— (సేవకునిజూచి) సేవకా ఆద్వారమునుబిగించి ఆపండ్లకట్టనిటు తీసుకొనిరమ్ము

సేవ— చిత్తము (అనిద్వారమునుబిగించి ఆపండ్లకట్ట తెచ్చిపెట్టును)

సునం— యిందులోనీ వేసినకాయ యేదియో తీసిచూపుము

శంబ— దొరోయిదిగో (అనిమంచికాయతీసియిచ్చును)

సునం— (అందుకొనిరాజుగారివై పుజూచును

కామ —సచివవరా సంకోశించెదవేల విచారింపుము

సునం —చిత్తము (అనిశంబరునిచూచి) శంబరాయీఫలము నీవుకొంటివా యెక్కడనైనా తస్కరించితివా

సం— (తనలో) ఇంకేముంది యీరోజుతో నాకొంపమునిగింది నా
చావురాచింది యీ కాయ చంగతి రాజుగారికెవరో చెప్పి నాగొంతు
కోయించడానికి పూనుకున్నారు (అనికనులదుడుచుకొనుచుండును)

సుసం— దురాత్మా చెప్పవేమిరా కొన్నావా

శంబ— (వడకుచు) దొరో చెప్తాచెప్తాకొనలేదండి

సునం—కొనకున్న యెక్కడనైనా దొంగిలించితివాయేమిరా.

శంబ—లేదుసామి

సునం— (కోపముతో) తస్కరా దొంగిలించకున్న నీకీకాయ యెక్క-
డిదిరా॥

శంబ — (పూరకొనును)

సునం—(కోపముతో) దురాత్మా మాట్లాడవేమిరా నీతోక్క చీల్చిం
చెద నిజము చెప్పుము.

శంబ—(కండ్లనీళ్ళు దుడచుకొనుచుండును)

సునం—(పండ్లుగొరుకుచు) భటులారా వీడు పచ్చిదొంగవలె గన్పట్టు
చున్నవాడు. నాలుగుతన్నినగాని నిజము చెప్పడు. (అనిసైగచేయును)

భటు—అరే పచ్చిదొంగా దొరగారిడుగుచుండ నిజము చెప్పవటరా
నీకని పట్టించెదములే (అని తన్నుదురు)

శంబ—(యేడ్చుచూ రాజుగారికాళ్లముందరపడి) దొరో నన్నుకొట్టించ
కండి నాప్రాణంపోతుందండి మీపాదాలసాచ్చండి నిజము చెప్తానండి
నన్నుకొట్టొద్దని చెప్పండి నన్ను రచ్చించండి నిజము చెప్తానండి.

కామ—భటులారా! కొంచెమాగండి (అని శంబరునిజూచి) యేమిరా
నిజము చెప్పుము.

శంబ—(లేచి) దొరో నేను పాపాత్ముండను రాజద్రోహిని క్రూరక
ర్ముండను నేనెంతకైనా చాలాచుండని నన్ను చంపించినాసరే బతి
కించినాచరే యేమిచేసినాచరే దొరోరి పాదాలకాడ నిజముచెప్తా

యినండి దొరో తమచిన్నభార్యగారున్నదే కుముదవల్లిగారు అమ్మో
రు యెందుకో నాకీఫలం యిచ్చిందండి యింతకన్నా మీపాదాల
సాక్షిగా చేసే మెరుగనండి (అని సాష్టాంగపడును)

కామ — (తలవంచుకొని తనలో) హాసదాశివా పరమేశ్వరా నీభక్తుండ
నైన నాకెంతటిగతిపట్టించితివిరా (అని చెంపలవేసుకొని) స్వామీ
నిన్నన్న దోషంబేమి కాదుకాదు నాదియేదోషము నాదియే బుద్ధి
తక్కువయైయున్న ఆదివర కొక్కరవివాహమాడివయసుముదిరి ముస
లివాడనయి రాజ్యమదాంధతచే కన్నుగానక చిన్నవన్నెలాడిగదా
యని మోహించి తగనివివాహమాడి పదుగురిలో తలయెత్తజాలని
గతి గూర్చుకొన్నది నేనేకాని పరులెవ్వరుగూర్చిరి ఛీనాజన్మకాల్ప
నా (అని విచారముతో నుండును)

సునం — దురాత్మా నీచాధమా యెంతటిక్రూరకార్యమునకు దలపడి
తివిరా నిన్ను కత్తికొక కండ తీయించినా పాపముండదురా కుముద
వల్లిగారిపై నేరముమోపి ఆమెప్రాణము తీయించి నీవు తప్పించు
కొని బ్రతుకనెంచితివటరా కానిమ్ము నీమచ్చ మాపెదనులే॥

కామ — (తలయెత్తకనే) సునందా దానినిగూడా పిలిపించివిచారింపుము.

సునం — కామమోహన మహారాజా రాణివాసినియగు దొరసానినిటకు
రప్పించుటకన్న అంతఃపురద్రోహిగా భావించి వీడినితగురీతి శిక్షిం
చుటయే మంచిదని నాభావము తెలుపింతు.

కామ — మంత్రివర్యా పూర్ణవిచారణకానిదివీడిని శిక్షించుటకు వీలుం
డదు యీ అప్రమాణమునకన్నా దానినిక్కడకురప్పించిన యెక్కు
డప్రమాణము రాదు. నామాట కెదురాడక పిల్పింపుము.

సునం — చిత్తము. (అని భటులనుజూచి) భటులారా వీడి నాకారాగా
రమందుంచి కాపలాయుంచుడు!

భటు — చిత్తము (అని లాగుకొని పోవుదురు(

సునం — సేవకా నీవేగి కుముదవల్లి గారినిటకు దోడుకొనిరమ్ము!
సేవ — చిత్తము (అని పోయి కుముదవల్లితో వచ్చును)
కుము — ప్రాణేశ్వరా! నమస్కారము (అని మ్రొక్కును)
కామ — (కోపముతో) ఛీపాపీ దూరముగా నిలచి సునందుండడుగు ప్రశ్నలకు జవాబిమ్ము (అని మంత్రివైపుజూచును)
సునం — తల్లీ రాజుగారిచే మీకివ్వబడిన సంతానచూతఫలము యొకకల వాడొక వేశ్యయింటికి దాసీదానిచే పంపుచుండగా చూచి ఆఫల మును దెప్పించి యొకకలవాడిని పిలిపించి అడుగగా తమరిచ్చినారని ఆనేరము తమమీద మోపినాడు. ఆఫలము వాడేరీతిగలించితిప్పించుకొనుట కీయుక్తిబన్నినాడేమో.
కామ — (కోపముతో) సచివా! తప్పించుకొనుటకు యుక్తి జెప్పుచుంటివా విచారించుచుంటివా పక్షపాతము చాలించి సరిగా విచారింపుము. (అని తలవంచుకొనును)
సునం — చిత్తము. (అని కుముదవల్లిని రాజుగారికాళ్లమీద పడుమని సైగజేయును)
కుము — (యేడ్చుచూ అంజలిఘటించి)

ఉ॥ ప్రేమనుగన్నవారికిని • పెండిలియాడిన యట్టిమీకు దు
ష్కామినినై చరించి త్రిజ • గంబులకీర్తి నడంచుదన్ను ని
ర్ధామ మహాగ్నికీలలను • ద్రోచియొ తావక ఖడ్గఖండనో
ద్దామతజూపియో దునిమి • ధర్మమునిల్పుడు ప్రాణవల్లభా!

(అని పాదంబుల వ్రాలును)
కామ — (కోపముతో) ఛీ కులటాగ్రిణీ ఆవలనిల్వుము.

చం॥ అరయ చతుస్సముద్రివల • యావని నెల్ల నిరంకుశాజ్ఞగా
నిరతము నేలు నాసతివి • నీచకులస్థుని సఖ్యమూని నీ
శిరమెటు లెత్తబూనితివి • ఛీ గుణహీనవు మానహీనవై
ఖరిజరియించితీవు నిను • కత్తితొకత్తుక నుత్తరించెదన్!

(అని పండ్లు గొరుకుచూ మీదికురుకును)

సావిత్రి — (ప్రవేశించి భర్తృకరము బట్టుకొని) నాథా నిదానింపుము యిదివరకెన్ని పాపకర్మములాచరించియుంటిమో సంతానహీనులమై కృశింపుచుంటిమి యిపుడు మీరొనర్చబోవు స్త్రీహత్యా దోషంబున కేగతిపాలగుదురో విచారింపుము (అని వారిద్దరికడ్డముగా నిలుచును)

కామ — (నలిపోయి సింహాసనముపై గూర్చుండి సావిత్రినిజూచి) నీ విట కెందులకు వచ్చితివి. అయిననూ యిదివినుము (అని కుముదవల్లి నిచూపుచూ)

సీ॥ క్షత్రియాన్వయమునఁ • సంభవంబందియు
నీచునిమరిగిన • నీచహృదయ
భూపతిభార్యగా • బొలుపొంది కామినై
నీచునిమరిగిన • నీచహృదయ
ధరణీతలంబెల్ల • దననెన్ననిలువక
నీచునిమరిగిన • నీచహృదయ
మహిలోనమానాభి • మానముల్ విడనాడి
నీచునిమరిగిన • నీచహృదయ

గీ॥ తల్లిదండ్రులు భర్తయు • తలలనెత్తి
యిట్టిసభలోన దిరుగాడు • నట్టిప్రాప్త
మింతలేకుండజేసిన • హీనమాన
దీనిజతనిల్వ దగదరు • దెంచుమిటకు॥

(అని తీసుకొనిపోయి తొడపై గూర్చుండబెట్టుకొనును)

కుము — (దుఃఖముతో అంజలిఘటించి)

ఉ॥ బుద్ధియునేరకిట్టిపని • బూనియొనర్చితి స్త్రీకులంబునం
దద్దిర గూర్చితీమలిన • మట్టినురాత్మను పాపకర్మనే

కద్దుననైన భర్తకర • వాలమునకా సరకంగనిమ్ము మొ
ద్దొద్దను చాపబోకు సత • తోన్నతముక్తిని గాంతు నక్కరో॥

(అని సావిత్రి పాదంబులఁబ్రాలును)

సావి — అమ్మా దుఃఖాపహము తెమ్ము తెమ్ము. (అని లేవదీసి భర్తనుజూచి) నాథా నామనవి నాలింపుము.

మ॥ పొరపాటన్నది యెరికైన గలుగుఁ • బూర్ణంబుగా భ్రాంతితో
స్థిరమైమానసముంచుగాన తమబు • గిన్నాది శిక్షింపకీ
తరుణిఁగావుము గావవేని ధరకాం • తాహత్య చేకూరు సు
స్థిరసౌఖ్యంబున గడ్డుగల్గును భవ • త్మిత్రంబు ఘోషించెడుఁ

(అని మొక్కును;

కామ — (విచారముతో నుండును)

సునం — (తనలో) యీమెగారెంతనిరంకుశ శాఖాశక్య మర్మగర్భితముగా యెత్తిపొడచుచూ బ్రతిమిలాడినది. బళే అందువలననే రాజుగారు మారుమాటాడక మిన్నకున్నవాడు. (అని రాజుగారివైపుజూచి) రాజుగారేదియో చెప్పబోవుచున్నవాడు వినియెదగాక.

కామ — (తలపంకింపుచూ) కాంతా నీకెందులకిటు గూర్చుండుము.

సావి — (యొక వైపు గూర్చుండును)

కామ — (మంత్రిఁజూచి) సచివవరా!

ఉ॥ మానవిహీనమైనపని • మానక చేసినదై మదీయ స
న్మానము మానునూహగల • మానసి మోమును జూడజాల న
ద్దానికి తల్లిదండ్రులిడు • దాసియుగంబు ధనంబు వస్త్రముల్
యేనిడినట్టివస్తువుల • నిచ్చి పురంబెడలింపుమిప్పుడే॥

యెద రాడక తీవరింపుము. (అని తలవంచుకొనును)

సునం — (తనలో) అయ్యో నీచెనీ పురంబునుండి వెడలింపవలయునట కానిమ్ము. ప్రాణములుండిన బలుసాకుదిని బ్రతుకవచ్చు నన్నట్లు

ప్రాణములు దక్కినవి. ఆహో అలుమోలిని యెక్కడనో బ్రతికెదరు
లే (అని సేవకునిజూచి ప్రకాశముగా) సేవకా రాజాజ్ఞ ప్రకారమీ
మెనీపురమెడలింపుము.

సేవ — అమ్మగారు మీయాస్తి యేమున్నదో తీసుకొని పోవుదురుగాక॥

కుము — సేవకా కొంచెమాగుము రాజుగారితో కొంత భాషింపవలయు
ను. (అని భర్తనుజూచి) నాథా యిదివినుము.

చం॥ అరయఁగ పూర్వజన్మ ఫలి • తాంశము నిన్ను వినాశ జేసెన
న్నరయఁగ రాదటంచు హృద • యంబునమీకను దోష జేసె భా
సురముగ ముందు నాకిడిన • చూతఫలంబి పుడిచ్చి పంపు మీ
సరగున నేగు దేపురము • సాంబసదాశివ శంభు నిన్నుచుఁన్॥

అదియునుంగాక,

చం॥ పురహరునంతవాడల స • ముద్రినిఁగూడిన గంగనిట్టులే
నిరసన మాచరించెనె వి • స్మరలగా మది నెంచి శీఘ్రమం
దరమర జెందకుంచటె య • యారెమదీయ కృతాపథ గామీ
సరణి ఫలించె నేమి విర • సంబిది చెప్పుము ప్రాణవల్లభా॥

కామ — (ఆగ్రహముతో) యేమీ నీవు గంగాభవానీ యంతదానవా!
ఛీ నీవిక్కడ మిక్కిలి ప్రసంగింపక నే చెప్పినట్లు వెడలిపొమ్ము॥

కుము — నాథా! ఆగ్రహింపకుడు తమరు పరశివునంతి వారలైన నేనునూ
గంగాభవానీ యంత దాననగుదు. అట్లు నీవునూగావు యిట్లు నేనునూ
గాను కాసింతు యిప్పుడు॥

మం॥ వదలన్ జాలని ప్రేమతోడ మిము దే • వాయంచు ప్రార్థింపుచు
న్మదచాంచల్యను తప్పుసైచినను స • న్మానించుటో లేకనో
సదయాకుత్సుక గోయుటో యవిన • నా చందంబుగాదయ్యె నా
నుపటల్ వ్రాసిన వ్రాతమారగలదా • నోరెండగా నేడ్చినన్॥

(అని దుఃఖముతో) నాథా నే నేమి చేయగలను. మీదయ నాపైనిట్లు
ప్రసరించినది. కానిండు నేనునూ నావస్త్రములు నాసొమ్ములు నా

ధనము నాదాసీలు తనికిరానపుడు నాకివ్వబడిన ఫలమువరకూ తమ కెట్లు తనికివచ్చును. ఆఫలమిటులిచ్చి శెలవింను పోయివచ్చెద. (అని మొ్రెక్కును)

కామ—(తలయెత్తకనే) సచివవరా ఆఫలంబిచ్చి తంపుము.

సునం— చిత్తము. (ఆఫలము చేతబట్టుకొని)

చం॥ గలుగును కష్టసౌఖ్యములు • గొముదినంతమనంబురీతి భూ
తలమున నేరికేని నత • తంబనులాత్ములు పూర్వజన్మ సం
కలితఫలంబటంచు హితి • కార్యములన్ జరియించుచాత్మలో
కలుగకనుండు రీతి తన • కాలముసిల్వదు నమ్ముమమ్మరో॥

యెప్పటికైననూ మంచికాలము రాకుండునా యేల చింతించెదవు యిప్పటికీఫలంబు గైకొని ప్రభునాజ్ఞగాబొమ్ము (అని యివ్వబోవును)

కుము— (అందుకొనక) సచివవరా ఆఫలమూ బల్లపైబెట్టుము తీసుకొనెదగాని యిదివినుము.

సునం—(అట్లే పెట్టి) అమ్మా చెప్పుము.

కుము– సచివవరా,

సీ॥ కలనైనననుబీడ • దలుపజాలనినాధు
డలుకచే నెడబాయు • దలచెనయ్యో
శయ్యపైజతగూడి • సరసమాడెడినాథు
డలుకచేనైన మా • టాడడయ్యో
పలుకెల్ల బరికింప • కలవరించెడినాధు
డలుకచే దలనెత్త • దలుపడయ్యో
అనగినిహారంబు • లందించునానాధు
డడిగినఫలమివ్వ • గడగడయ్యో

గీ॥ నేనొనర్చుతప్పొకటేలు • గానబడుట
వలననోరెత్తి మాట్లాడ • గలుగనైతి

సప్తకష్టాలపాలైతి • నవనియందు
స్త్రీలకీబుద్ధి దైవంబు • జెరచుగాత॥

(అని ఆ ఫలమందుకొని భర్తనుజూచి) నాథా॥

మ॥ బరగఁ బెండిలి యాడినన్నిటకు భ • వ్యప్రోషిణిఁ దెచ్చి స
త్కరుణఁ దల్లిని దండ్రినిఁ మరచు చి • త్తంబొప్ప పోషించి ని
ష్కరుణఁ గొద్ది నెపంబుతో నడవి పా • ల్గావించు నీవిట్టు లా
ఖరిచూపైనను చూచి పంపవిది యే • కాఠిన్యమో వల్లభా॥

కామ (తలవంచుకొని పూరకుండును)

కుము — (అంజలిఘటించి) నాథా నేనేరివాగినను మాపుమాంటుడ వేమి

కం॥ ఘనయపహాస భరంబున
మనియుంటకు నిష్టపడును • మాంచిదిగాదై
ననుభవదాజ్ఞా భృత్య్చ
ర్ష్ని జనిమొన దోసిలిడుచు • శెలవా శెలవా॥

(అని నమస్కరించి విభునివైపు జూచుచూ పోవుచుండును)

కామ — (తలయెత్తక నే సాజ్ఞనిచ్చును॥

(అందరూ కొంతదడవు విచారముతో నుందురు)

కామ — సచివవరా దాసీఫలన యెమియూ తప్పులేదు. గావున విడుదల చేయుము.

సునం — చిత్తము. (అని సేవకునిజూచి) సేవకా ఆపండ్లసెట్టనిచ్చి దాసీ దానిని పంపివేయుము.

సే — చిత్తము అట్లె (అని దాసీదానినిపంపివేయును)

కామ — మంత్రివర్యా యీయెరుకలవాడిగృహము మనయుద్యానవన సమీపములో దక్షిణదిక్కునయున్నదనివినియుంటిని. వానినాగృహము విడచి యేయరణ్యముననో యుండునట్లు నియమింపుము. నేటికి సభ చాలించి అంతఃపురమున కేగుచుంటి (అని భార్యతో సహా నిష్క్రమించును)

సునం— భటులారా ఖైదీగ నున్న యెరుకలవానినిటకు దీసుకొనిరండు.

భటు— చిత్తము అట్లే (అని శంబరుని తీసుకొనివత్తురు.

సునం— (పండ్లుగొఱుకుచూ శంబరునిజూచి)

మ॥ ధనమార్జించితీవన్న కావరముచే • దప్పొప్పనర్ గానకా
జననాథాగ్రిణి భార్యకాపురము ధ్వం • సంబిట్లు గావించు ని
న్ననుమానింపక కాకగృధ్రములకా • హారంబుగాజంపి వే
సిన దోషంబౌనగూడదార దురితా • ఛీ నీచవంశాధమా॥

(కత్తి దీసుకొని మీదికిఛుమికి నరుకబోయి వెనుకకుతగ్గి) దురాత్మా రాజాజ్ఞ లేదు. గనుక నిన్ను ప్రాణంబులతో విడువవలసి వచ్చినది. అయినను,

ఉ॥ యెప్పటికైన నిట్టిపని • నేనొనరింప నటంచు చెంపలన్
దప్పక వేసికొమ్ము (అని వేయింతురు)

ఉ॥ విబుధప్రకరంబును గాంచి మ్రొక్కుదం • చిప్పుడు మూడు
సార్లనుము (అనిపింతురు)

ఉ॥ హీనులమాన్యుల గుర్తెఱుంగు చే • దప్పులనాచరింపనని దండము
బెట్టుము జ్ఞానశూన్యుడా॥ (అనిమూడుసార్లుదండము పెట్టింతురు)

యిక మాయుద్యానవనప్రాంతమునుండిక యేయరణ్యమునకో కాపురముండబొమ్ము లేదేని నీప్రాణములు దక్కవు. (అనిభటులనుచూచి) భటులారా వీని నేయరణ్యమునకో వెళ్ళదరిమిరండు (అనునంతలో తెరబడును)

{ తెర లేచును కుముదవల్లి, లవంగి, కోమలాంగి యీ
ముగ్గురూ అరణ్యములో చెట్టుక్రిందకూర్చొని యుందురు. }

( 3 అనుబంధము )

కుము— (దుఃఖముతో) లవంగీ

మ॥ పతిభక్తిన్ జరియించుచుందురిల నే • పద్మాక్షులైనన్ సదా
తిపనేపేడితి నేను నాకిలను పా • పప్రాప్తియేగాని స

త్కృతిసౌఖ్యంబులగాంచ వేర్తు నెయిసీ॰ కృత్యానుకూలంబుగా
గతిప్రాప్తించునుగాని వేఱుగతి ని॰ క్కెంబెట్లు ప్రాప్తించెనురా?
యేమన్న. నాగతిచూడుము,

సీ॥ పూలపాన్పునజేరి ॥ పొర్లాడుదాననీ
పలుగురాల్పరుపుపై ॥ బండవలశె
స్పటికంపుమేడల ॥ వర్తిల్లుదాననీ
కొండరాల్గుహలలో ॥ నుండవలశె
నలకీరపుశ్వాన ॥ మాలించుదాననీ
వ్యాఘ్రోగ్రరవముల ॥ కడలవలశె
చల్లనినీడల ॥ జరియించుదాననీ
చండాతపజ్వాల ॥ నుండవలశె
గీ॥ యానయానంబు పదరక్ష ॥ యానమయ్యె
నాకలెటువంటిదో జెల్ల ॥ నట్టిదాన
నన్నపానాదుల కిపుడా ॥ పన్నగుచు
గుందవలసెను విధినిట్లు ॥ కోమలాంగి॥

(4వ అనుబంధము)

(అని దుఃఖముతో కూలబడును)

కోమ— (దుఃఖముతో లేవదీసి) అమ్మా యిట్లు చింతింపుచూ కూలబడిన నేమిలాభము. మనపాలిటవచ్చిన కర్మమేవిధముననైనా మనమే అనుభవింపవలయును గదా నీవెరుంగవా కానిమ్ము ముందుజరుగబోవు కార్యంబునకై విచారింపుము. ధైర్యమవలంభించుము॥

కుము— కోమలాంగీ యింకేటి కార్యవిచారణ యేమిధైర్యము నా కాళ్లు కవ్వలుకదుచున్నయవి. (అని కూలబడును)

ఉవం— తల్లీ! విధివిధానంబువిచారింపక కూలబడెదవేల ముందు

ఉ॥ ఆకలిమంటనార్పుటకు ॥ నాఫలముల్ భుజియింపు మందుచే
నీకమృపా షఫలించు సుఖ ॥ నీరధిమున్గుట కాలవాలమై

చీకునడంచు వేసుకిధి • జెప్పకు మార్యనొ న్వేల్పనోపున
శ్లోకమడంప జెప్పితిని • శూలివరాస్థ ఫలంబుగావునన్॥
(అని కుముదవల్లి నడియందున్న ఫలము దీసియిచ్చును)

కుము — (చేతబట్టుకొని) లవంగీ ఆపరాత్మకుని కరుణచే నల్లో సుతో దయమైనచో,

శా॥ నాడేనాథుని బాయుకీబిడకు ని • న్నుగ్రగర్భ మెట్లామె నం
చాడన్నూబినవారినే విమలవా • క్యపౌత్రి మెప్పింతు మే
జాడన్నుతుప్రిని బెంతు మేకిధిని శా • ప్రస్తానిగా జేతు నే
వాడన్నెంద్లి నొనర్తుమే ప్రకభల భా • స్వద్రాజ్య మేలింతుమే।
యిట్టి వికటభ్రాంతుల నందియే పడరాని యిక్కట్టుల పాలైతిమి యే టికీ యుకదప్రనకర కార్యంబొనరింప బూన్చదవు (అని నిట్టూర్పుతో కూర్చుండును)

లవం — అమ్మా యీపనియు వృధ వానుకూలంబని భావించితివా కాదు కాదు. యీమన్న భర్తనుపిడిన రోజుననే యీ సంతాన ఫలంబు భుజించి గర్భముధరించెదవు గనుక లోకులెవ్వరునూ యిట్లనుగుటకు సందుండదు. తనచేతిమీదిగా నివ్వబడినసంతానఫలము నీకడనుండుటచే నీభర్తయూ సందేహపడవీలుండదు. అంతియేగాక పరమేశ్వర వరప్రసాదా పిర్భూతుండగు బాలకుని పోషణవిషయమైగాని యింకేవిషయమైగాని మనమంత కష్టపడ వలశినంత యవసరముండదు. ఆపరమేశ్వరుండే అన్నివిధముల కాపాడగలడు. తప్పక నీవు ఆపరమేశ్వరధ్యానాయత్తచిత్తంబుతో ఆఫలమారగింపుము. లెమ్ము (అని లేవదీయును)

కుము — (లేచి అంజలిఘటించి)

ఉ॥ మానవిహీననంచు నను • మానము జెందకు యుష్మదీయ సం
తానఫలప్రసాదమును • తావకభక్తి భుజింపుచుంటి ని

ద్దాని ఫలా ఫలంబులను • తా మె భక్షించిటేరింప జేయగా
బూనవలెఁ దయానుమతి • పుణ్యశీభూషణ భోగిభూషణా॥

(అని నమస్కరించి ఆఫలమారగించును)

లవం — అమ్మా ఆకలితీరినదా,

కుము — అపరాత్పరుని కరుణచే ఆకలితీరుటయే కాదు, శ్రమయూ తీరినది.

కోమ — తల్లీ యిక నడువగలవా!

కుము — ఆ నడువగలను గాని మీరుగూడా యీ చూతఫలంబుల నార గించి క్షుత్పిపాసల శ్రమదీర్చుకొనుడు (అని తనపెట్టెలోని చూత ఫలంబుల చెలికత్తెకీ యిచ్చును)

చెలులు — (అందుకొని భుజింతురు)

కుము — చెలులారా! మనకే పురంబు నివాసయోగ్యమో విచారింపుడు.

కోమ — తల్లీ దానికింత విచారమేల తమపుట్టింటికేగిన మనకు యోగ్యముగా జరుగదా.

కుము — కోమలాంగి నీవెంత వివేకశూన్యవు నేను క్షత్రియవంశమందు జనించి వంశకళంకంబైన పని నొనర్చి భర్త చే వెడలగొట్టబడి శిగ్గులేక

గీ॥ తల్లిదండ్రుల కడ జేరి • దగుదుననుచు
శీర్షమెత్తియు మాటాడ • జెల్లుదమ్మ
తప్పులేనట్టి దమయంతి • తల్లిదండ్రు
లకడ కేగనే పరువు చు • ల్కనదలంచి॥

అట్లే మనమే పురమునకో పోయి తలదాచుకొనుట యుత్తమముగాని తగుదునని పోయి సరిబంధువులలో చౌకనౌట భావ్యమా అట్లు దా మనకుతగిన పురంబేదియో విచారింపుము।

లవం — అవును నిజమే అట్లయిన మనకు.

కం॥ ఈవన సాన్నిధ్యంబున
భావనమైనట్టి పురము • బరగును నిలువన్

కేవలసౌఖ్యాలయములల
భావింపగలేవు కుముద • వల్లీతల్లీ!

ఆనాగపురమునగల ఆలయంబులలో నొకదానిని విశ్రాయమునకు తీసికొని కాపురంబుండుట యుత్తమంబని నా భావము తమ చిత్తమెట్లున్నదో.

కుము — లవంగీ నీవు చెప్పినదేయుక్తము. ఆపురమునకే పోవుదము పద.
( తెరబడును )

{ తెర లేచును సదాశివయోగి ఆశ్రమము. కుముదవల్లి, లవంగి, కోమలాంగి నిలచియుందురు. }

లవం — అమ్మా యీవన మెవ్వరిదియో యెరుంగుదువా!

కుము — యీవనము నేనెరుంగుదును యెవరిదియో చెప్పుము.

లవం — తల్లీ యిదియే సంతానేశ్వరవనము. యీవనముననే మనరాజుగారు అన్నపానాదుల వర్జించి వాయుభక్షణతో మూడుమాసములు తపంబాచరించి నీవుభుజించిన సంతానఫలము తెచ్చినాడు యీవనంబున కనేకులు సంతానార్థమై నీళ్వరుభజింపుచూ నివాసముందురు. అదిగో ఆ అగుపడునదియే సదాశివయోగిఆశ్రమము. అటకేగి వంటచేసుకొని భుజించి యీరాత్రి నీ యీశ్వరు భజింపుచూ గడపి రేపుదయమే నాగపురంబున కేగుదము పద. ( అని నిష్క్రమింతురు అందరూ వకవైపుగా వచ్చి కూర్చుందురు)

కుము — చెలీ యీఆశ్రమమెంతి రమణీయముగా నున్నయది.

గీ॥ మంచికోనేళ్లు భావులు • మంటపములు
పూలవనములుపొదరిండ్లు • పుణ్యనదులు
పండ్లతోవులతరగతుల్ • ప్రబలెనిచట
దీనినిమించిననెలవెందు • దెలుపగలవె!

లవం — అమ్మాదీనితో సమానమేదియు గానము.

కుము—లవంగీ అవును యీవనమిదివరకెరుగుదువా

లవం— మాతండ్రి యీవనమునకు నన్ను తీసుకొనివచ్చి యిూశ్వరునకు
 వరకడ జేసెను అందువలన యెరుగుదును॥

కుము—నీకు సంతానము యెందువల్లనే కలిగినదా.

లవం— అవును.

కుము—లవంగీ యీకుటీరమెవరిది.

లవం—అమ్మా యిదియే సదాశివయోగి ఆశ్రమము.

కుము— అట్లైన వారు కనుపించరేల.

లవం— అమ్మా సామాన్యులకు కనుపించరు.

కుము— నివెన్నడైనా చూచితివా॥

లవం— లేదు లేదు.

సదా— (ప్రవేశించుచూ)

ఉ॥ వాసవు నబ్జసంభవుని • వారిజనాభుని స్వర్గపత్తనా
 వాసుల సూర్యచంద్రుల వి • భావసునభ్రి సుతుల్ప్రచర్యలీ
 భాసురలోకజాలములు • ప్రాణిసమూహములన్నియుక్ భవ
 చ్చాసనబద్ధమైదనరు • సాంబసదాశివ భక్తశంకరా॥

కుము—లవంగీ అవచ్చు మహానుభావు డెవరో చూడుము.

లవం—అమ్మా వీరె సదాశివయోగి గారోలు.

కుము—అమ్మా అటులనా (అని లేచి అంజలిఘటించి) మహాత్మా

ఉ॥ ఎవ్వరుమీరు మీవిషయ • మేమియెఱుంగ మకారణంబుగా
 నివ్వనసీమ దగ్ధమము • నిచ్చితిరిట్టిని కీర్తివేళ మా
 కెవ్వరుదిక్కు లేరు దయ • నెట్టులనైన భవచ్చరిత్రి ము
 న్నిట్టివెలుంగుతోడను మ • దీయభయోగ్రత మంబుమూపవే॥

(అని నమస్కరించును)

సదా —అమ్మా భయపడనవసరముండదు. ధైర్యమవలంభింపుము. నేనీ

ఆశ్రమవాసుండను. సదాశివయోగి నామధేయుండను. (ధ్యానమ భినయించి) అమ్మా నీ వెవరో యని యోచించితి గాని నీవు కామమోహన మహారాజుగారి భార్యవు కుముదవల్లివి యొక కారణంబుచే భర్తచే వెడలగొట్టబడితివి. అయినను యీరోజున నీవు భుజించిన సంతానఫలము యీశ్వర వరప్రసాదితంబగుటచే నీ దోషంబులన్నియూ నసించినవి. నీకొక పుత్రుండు గలుగును. అతని మహాత్మ్యము వలన నీదుర్దశ తొలగిపోవును. రేపుదయమున యీవనంబున కావలగల నాగపురంబున కాపురంబుండబోదువు, నేనప్పుడప్పుడు మీకు దర్శనమిచ్చుచుండెద సత్యము. మీరిట నేశయనింపుము. నేనాఆశ్రమంబున శయనించెద. (అని నిష్క్రమించును)

కుము— లవంగీ యీరోజు మనకు మంచిదిగానే పరిణమిల్లెను. యీమహాత్ముని దర్శనమైనది. చాలా పొద్దు పోయినది. పరుండుదము. (అని పండుకొనుదురు)

సదా— (తిరిగీ ప్రవేశించి) కుముదవల్లీ లెమ్ము లెమ్ము.

కుము— (లేచి) స్వామీనమస్కారము. (అని నమస్కరించును)

సదా— (కుముదవల్లికి ముఖవస్త్రమేసి బోధించి) అమ్మా యిది పంచాక్షరి దీనిపఠనమువలన సమస్త దోషములణంగి దివ్య తేజంబున ప్రకాశింతువు యిక నేను బోవుచున్నాడ. (అని అదృశ్యుండగును)

కుము— చెలులారా! లెండు లెండు తెల్లవారినది.

చెలులు— అమ్మా అప్పుడే తెల్లవారినదా (అని లేతురు)

కుము— చెలులారా! యిక మనమానాగపురంబున కేగుదము పదండి. (అని నిష్క్రమింతురు)

ద్వితీయాంకము.

సమాప్తము.

---

శ్రీరస్తు.

# నిజలింగచిక్కయ్య

## తృతీయాంకము.

(బడిపంతులు ప్రవేశించి)

పంతు — (తనలో) అయ్యయ్యో యిప్పటి కాలపు పిల్లలెంత దుష్టపిల్లలు పొట్టజరుగకీబడి చెప్పుకొనుచుంటిగాని నాయుగచాట్లుభగవంతుని కెరుకగా నున్నయది.

సీ॥ బడికిరాకెగ్గొట్టు • బుడతలింట్లకుపోయి
ప్రతిరోజు గొనివచ్చు • భాగ్యమొకటి
చదువనిపిల్లల • సాధించిచట్రాత
నారదీసెడు పని • చారమొకటి
మొండిపిల్లలబట్టి • దండించి తలిదండ్రు
లరతురేమోయను • చడలుటొకటి
అల్లరిపిల్లల నదలించి • యదలించి
సరసులుగామి వే • సారుటొకటి

గీ॥ అడగినను జీతమివ్వక • పెడమొగంబు
బెట్టువారితో పోట్లాడ • పెట్టుకొనుటో
కటిగలిగెడి పంతుల వృత్తి • కష్టవృత్తి
దీని నీకాలమున నేరు • బూనరాదు॥

ఐనను జీతములు సరిగా వచ్చుచూ పిల్లలల్లరి లేకుండా చక్కగా బడికివచ్చి చెప్పినట్లు చదువుకొనుచుండిన నాకింత కష్టమనిపించదు. యిందులో నొకచిక్కయ్య మాత్రము చక్కగా బడికివచ్చి దినదిన

ప్రవర్ధమానముగా చదువుకొనుచున్నవాడు జీతము సరిగా వచ్చుచున్న యది. ఆతండీరోజున నెందులకో బడికి రాడాయెను. (అనికొంచెము సిదానించి) కొందరల్లరివాండ్రతో సాంగత్య మలవడుటచే నిటకో పోయె గాబోలు నేపోయి పిలుచుకొనివచ్చెదగాక (అని తెరలోనికి పోవును)

{ తెర లేచును కుముదవల్లి, లవంగి విచారముతో కూర్చొనియుందురు. }

శంతు — (ప్రవేశించును)

కుము — (లేచి) శంతులుగారూ నమస్కారము. యీ పీఠముపై కూర్చుండుడు.

శంతు — (కూర్చొని)

ఉ॥ మిక్కుటమౌ విచారమున • మీరు చరింపుచు నుంటి రేల నే
నెక్కడికేగె చిక్కయ యి • సీనచియింపు డతండు నిక్కమౌ
చక్కని తోవ బోవు సర • సత్వము గల్గినవాడు నేడు యే
టక్కరిబోధలన్ బడి ధ్రు • వంబుగ మానెను యీదినంబునన్॥

తానెంతి విద్యాపరిపూర్ణుడైననూ కొన్ని శాస్త్రంబుల పరిశీలించి వాటి విషయము దెలశుకొన వలసియున్నదిగదా యెందుకీ పెత్తనములు.

కుము — అతడల్లరివారలగూడి వేశ్యాగారములదిరుగుచున్నవాడని వినుచుంటిమి. యీవిషయము వెల్లడిగాక పూర్వమే వివాహ మాచరించిన యోగ్యముగా నుండునని యోచింపుచుంటిమి. యీవిషయమై తమరు శ్రద్ధపూని మీశిష్యునకెక్కడనైనా యొకపిల్లను విచారించుడు.

శంతు — (సంతోషముతో) అమ్మా యీపురంబునకు కొంత దూరంబునగల శివపురంబున యొకరాజు కుమార్తెగలదు. గౌరియను నామంబున గౌరీధ్యానపరాయణత్వమున వర్తిల్లునామె నెట్లైననూ మాట్లాడి చిక్కయ్యకు వివాహ మాచరించుదము. యిందు విషయమై విచారపడనవుసరముండదు. యిందు బాధ్యతి నాదియె. (తెర వ్రాలును)

(తెర లేచును-సీమంతినీ గృహము)
(సీమంతిని 5వ అనుబంధము)

చిక్క — (ప్రవేశించుచూ తనలో)

చం॥ చదివితి నెల్ల శాస్త్రములు • సత్యమసత్యమెరింగినాడ దు
ర్మదపరిపంథి సంఘసము • దంబునవిల్చి జయించువాడ నీ
పదనముల గొల్చువాడ ధర • పాలనశక్తిగలాడ నన్ను సం
పద కెడబాపితేల నిది • పాడియె నీకు మహేశ్వరాననమో॥

(అని నమస్కరించి) మహాత్మా నిన్నసఫలంబేమి యేటక్కరి బోధలనో జిక్కి.

సీ॥ అగ్నిసాక్షిగ బెండ్లి • యాడినసతియుండ
వారాంగనావాంఛ • బడుటదేల
వెలలేని సౌభాగ్య • వలరాజుసతియుండ
వెలకాంతపొందుకై • వెళ్లుటేల
మానాభిమానియై • మనియుండుసతియుండ
లజ్జావిహీనక • ల్లాడనేల
పరపతివ్రతయైన • వరవర్ణినియుండ
సర్వవల్లభతోడి • సఖ్యమేల

గీ॥ లుట్టిమర్గ్గాస్థిచేత • నిల్లునెల్ల
గుల్లజేసి కూటికిగుడ్డ • కునుకృశింపు
చుంటి పరులమాటలవిను • చుండువారి
పాటులివిగాక శ్రేయమే • పారగలదె॥

(అని ప్రవేశించును)

సీమ — అయ్యా చిక్కయ్యగారూ అటు కూర్చొనుడు

చిక్క — (విచారముతో కూర్చుండును)

సీమం — చిక్కయ్యగారు మీరిటకు వచ్చినపని యేమి

చిక్క — సీమంతినీ యేమిట్లడుగుచుంటివి నిన్నజూచుటకన్నా వేరుపని యేమున్నది.

సీమం — అటులైనా సరే

సీ॥ ఆడిగిన ధనమెల్ల • నందించువారినే
పలుకరించెడువిధి • గలదుమాకు
అందమౌ వస్తువు • లందించువారినే
గౌగలించెడుబుద్ధి • గలదుమాకు
సుందరాంబరముల • నందించువారినే
గలసిమెలగుకాంక్ష • గలదుమాకు
ఆహారమునకర్థ • మందించువారినే
వలపించగల భ్రాంతి • గలదుమాకు

గీ॥ కానిమముబోటిపేదల • గడపద్రొక్క
నిచ్చమర్యాదమాకులే • దిద్దిచెలసి
వచ్చినాడవుయికనైన • వచ్చినట్టి
త్రోవబట్టుము లేకున్న • ద్రోడరుకేమ॥

చిక్క—(కోపముతో) సీమంతినీ యివి నూతన భాష్యంబులా యేమి యిదివినుము.

సీ॥ ఆడిగిన ధనమెల్ల • నందించితినిగాన
పలుకరించెడిహక్కు • గలదునాకు
అందమౌ వస్తువ • లందించితినిగాన
గౌగలించెడిహక్కు • గలదునాకు
సుందరాంబరముల • నందించితినిగాన
గలసిమెలగుహక్కు • గలదునాకు
ఆహారమునకర్థ • మందించితినిగాన
వలపించగలహక్కు • గలదునాకు

గీ॥ యిన్నిహక్కులు గలవాడ • నిన్నుబాసి
చటకుబోయెద నీమది • కుటిలతవిడి

మన్మథావస్థ దీర్పవే • మనసు కుదుర
లేనియెడ నిన్ను తగవాడి • లేతు జేతు॥

విశంగి — (ప్రవేశించి) అయ్యా చిక్కయ్యగారు మాతోటగవాకు బెందులకు యివియన్నియూ యెవ్వడిచ్చితివి. యిప్పుడేయిచ్చితివా యేమి.

చిక్క — యిప్పుడుగా దినివరకేయిచ్చితిని.

విశం — (నవ్వుచూ) అట్లయిన యిట్టిచ్చిన వారెందరుండిరి నీవలె వారికి మాత్రిమూ హక్కుండదా నీమాత్రము వారికి నోరుండదా యిక చాలుచాలు గడపవాటును.

మస్తాన్ — (ప్రవేశించుచు) క్యాహై సీమంతిని క్యాకరీతేహై (తెరలోనే యుండును)

విశం — (ఆలకించి) మస్తానుసాహెబుగారు యిక్కడొక్క రావపిచాశంతో పోరాడుచున్నదండి మీరు త్వరగ రండి పత్తుగా మర్దించుదాము. (అని బిడ్డనుజూచి) అమ్మాయీ త్వరగాబోయి తలుపుదీసిరమ్ము వీనిపని పట్టింతాము.

చిక్క — (తనలో) వీరు నాపక్షములేని కారణముచే యెంత బలాఢ్యుడనైననూ వీనికి వెరచి పోవవలసివచ్చినది. (అనునంతలో తెరబడును)

చిక్క — (తెర యీవలకు కుంటుచూ ప్రవేశించి)

చం॥ పరువునసించినన్ ధనము • పాడయినన్ వసనాశనంబులన్
కొనువనిపించినన్ తనువు • కంఠముతో యెముచిక్కగల్గి కా
ల్విరుగగ గోడఘూకికము • భీతినిబారెను కష్టముబ్బినన్
మఱవగరాని మోహమల • మానినిపైగలదెట్టు లీశ్వరా॥

(అనికుంటుకుంటూ) నిష్క్రమించును)

(తెర లేచును చిక్కని యిల్లు)

గౌరి — (విచారముతో) హా గౌరీమనోహరా

మ॥ మునుజన్మంబున మంచికాపురములు • న్మాలించితో లేక స
జ్జనులన్ దూఱితొ చండికార్చనముని • చ్చన్నల్పగా లేవొ భ

ర్తను బోనాడితినేమొ నావిభుడు దు ◆ ర్వారాంగనా మోహవా
ర్ధి నపాయంబు నెఱుంగకఁ మునిగెనం ◆ దేహింపకీజన్మలో॥

అట్లు మునుగుటయేగాక,

సీ॥ ఆకలికన్నంబు ◆ నడుగబూనుటె కాని
భుక్తికర్థార్జనా ◆ సక్తిగనడు
అనువుగా భోజనం ◆ బమరలేదనుకాని
యదియెట్టులమరునం ◆ చాత్మగనడు
బెదరించి పెడనగల్ ◆ వదలించుటే కాని
ముందురానున్న యి ◆ బ్బంది గనడు
తీరిన వేళకే ◆ తెంచుచుండునుగాని
యింటమేమల్లాడు ◆ చుంటగనడు

గీ॥ తనకుపనికిరాని నగల ◆ ననుదినంబు
భోజనాలకునమ్మితి ◆ రోజువరకు
యింక నేయాస్థినమ్ముదిం ◆ కెట్లుజరుగ
వలయునో గోచరింపదు ◆ పార్వతీశ॥

యింతియేగాక,

గీ॥ తాను యీరీతి దిరుగుట ◆ దలచిదలచి
తల్లిమంచాన బడుటయే ◆ దలుపడయ్యె
నామెకుపచారమును జేయు ◆ చడలునన్ను
బూనిగద్దించుటేనియు ◆ మానదయ్యె॥

హే సదాశివమూర్తీ యీయగచాట్లకు మూలంబైనయీపాడుజన్మ నేల పుడమిపై బుట్టింపవలయును. యిక తుదముట్టింపరాదా యిఖ నేనుండి యేఫలము సంపాదించ గలను. (అని చెరగు పరచుకొని పరుండును)

చిక్క— (ప్రవేశించి) ఓసీ యింకాపరుంటివేమి

మ॥ అపరాహ్ణంబిది గానవో యిటుల దే • హంబెల్ల మత్తెక్కి ని
న్నిపరీతస్థితికిట్లు మార్చెనో ననుఁ • వీక్షించి లెక్కింప వే
మిపుడే యున్నము నాకు బెట్టెదవు వం • టే శేయకున్నావ హా
కపటీపుచ్ఛరణ ప్రహారముల జ • క్కన్జేతు నీ సేతలన్॥

(అని మీదికి పోబోవును)

గౌరి— (లేచి అంజలిఘటించి) నాథా నామనవినాలించి మీ యిష్టమైన విధిని శిక్షింపుడు.

చం॥ జరిపితినిన్నినాళ్లు విర • సంబుగి మేనినగల్ ప్రయింపు చి
త్తరి కడముట్టె నన్ని మెడ • దాల్చినమంగళ సూత్రమొక్కటే
సరికిది విక్రయింపగను • స్వాంతమునన్ దలపోయుచుంటినో
పరమకృపాలవాల నను • పాలన సేయుము కొట్టరాకుమా॥

చిక్క— (వెనుకకుదగ్గి) అటులనా అటులే త్వరగా వంటసేయుము.

కుము— (దాదిపట్టుకొని యుండ ప్రవేశించును)

గౌరి— (తటాలునకుముదవల్లిని పట్టుకొని యొకపీఠముపై కూర్చుండ పెట్టి) అత్తగారూ నమస్కారము (అని నమస్కరించును)

చిక్క— (తలవంచుకొని కూర్చుండును)

కుము— (కోపముతో) యేమిరా యేమనుచుంటివి.

ఉ॥ కన్నులుగానరాని పెద • గాడిదవై వెలకాంతపొందు కై
యున్న ధనంబు వస్తువుల నూడ్చి • నిరక్షరకుక్షిరీతి నా
కన్నము వండిపెట్టుమను • చారడిన ల్వెడ విట్లుదెచ్చి నీ
కెన్నిదినాలు బెట్టగల • దిట్టికులాంగన యేరికబ్బురా॥

ఉ॥ మేనినగల్ వ్రయించి మన • మేనులజీవను లాపిపోవ నా
నూన మహాత్ప్రసాదమున • నోటికివచ్చిన రీతిబల్కు వె
ద్దానిని మార్చిపెట్టు సతి • తంబు భవద్గతి తార్థమున్న న
ద్దేని వ్రయించి పెట్టుమిక • నీదినమాదిగ భాగ్యహీనుడా॥

సీ॥ సరససామ్రాజ్య • సంపాదనను మాని
వేశ్యాసామ్రాజ్యాన • వెలసినావు
కులకాంత సంభోగ • సలిలాశ్రయము మాని
వేశ్యాభోగాంబుధి • వెలసినావు
శిష్టానుచారివై • చెలగుటంతయు మాని
వేశ్యానుచారివై • వెలసినావు
సరివారిలో కీర్తి • సాధించుటను మాని
వేశ్యాపకీర్తిలో • వెలసినావు

గీ॥ యిట్టినీపట్టు దలకార్య • మెట్టిదైన
నిల్లుగడపంగ గలదేమొ • యెంచిచూడు
దుర్మదోన్మత్త నీకింక • దొంగతనము
పట్టుబడవలె డబ్బుచే • పట్టుకొనగ॥

గీ॥ కూలిపనివారలైనను • కూటికేని
గుడ్డకేనియు కరువులే • కుండుటయును
గాంచి శిగ్గులేకిట్లు వా • గంగనేల
పురుషజన్మకు తగువృత్తి • పూనుపోర॥

(అని వెట్టబోవును)

గౌరి—(అడ్డమువచ్చి) అత్తగారూ నామనవి నాలింపుడు నా కడనున్న వస్తువులన్ని బోగా మిగిలిన,

ఉ॥ మంగళసూత్రమీదినము • మాంగల్యదభుక్తికి యొక్క మానమే
భంగముగల్గబోదు విధ • వంబులునిల్చుట కల్ల శాశ్వతో
త్తుంగపతివ్రతాచరిత • తోయధియుంకదు యీజగంబులే
భంగముచేత గృంగినను • భావమునన్ గనిపెట్టుమత్తరో॥

గీ॥ గాన నాభర్తనిప్పుడు • గనలితిట్ట
బోకుమీ మనాచరణపూర్వ • పుణ్యమిట్టు

లక్షలిచ్చెంచెగాని పతివ • లన గలదురి
తింబొకింత లేదది యదార్థంబుతల్లి॥

(అని మొక్కును)

కామ—నాయనా నీభార్య వినయవిధేయత గనిపెట్టితివా యిట్టిభార్య
ను విడనాడి,

గీ॥ ఎంతధనమిచ్చినసుగాని • యింపులేక
రోజురోక్క౦బలాడూరు • నాజరించు
దాసిపొందు వాసింపగా • దలచుచున్న
గోడసున్నాన విడియంబు • గొనుటసుమ్మి॥

చాలుచాలు యింతటనైనా క్షత్రియ కులాచార పద్ధతిని సంచ
రించుము (పౌరబడును)

చిక్క—(ప్రవేశించి తనలో)

చం॥ అరియగనీకు దొంగతన • మబ్బినడబ్బు లభించునంచు సు
స్థిరముగ బల్కెమాజనని • డీనుడనాకది నేర్పువారలి
త్తరిగను కట్టరైరి నను • ధన్యునిజేయవె వారిప్రాపు నా
కరమరలేకగూర్చి కర • కంఠసదాశివ దాసపోషణా॥

(అని తెరలోనికిపోయి రంగనితో ప్రవేశించును)

రంగ—అయ్యా తమకీవిద్య నేర్చుకోవలెనని యున్న ముందుగా మిమ్మొ
క్క పరీక్షచేసెద. యీతాటిచెట్టుపైన గృడ్లను తనపొట్టక్రింద పెట్టు
కొని ఆగూటిలో కరుండిన గ్రద్దకు మెలకువ రాకుండా ఆగుడ్లను
తెచ్చితివా నిన్ను మెచ్చి మేమూ నిచ్చెద అటనిచేయుము.

చిక్క—అయ్యా యిదిప్రధమప్రయత్నమగుటవలన యేవిఘ్నము గల్గు
నోగాన నీవు ముందు నేను జూచుచుండగా రెండుగృడ్లనుదెమ్ము తదు
పరి తక్కినవి నేను దెచ్చెదను.

రంగ—చిత్తము అట్లే (అని ఆచెట్టెక్కి మెల్లగా గృడ్లను తనవడియందే
శుకొనుచుండును)

చిక్క—(తానూ మెల్లగా చెట్టెక్కి రంగనివడికి బెజ్జమేసి ఆగ్రుడ్లను తన
వడియందు పెట్టుకొని మెల్లగాదిగివచ్చి యెప్పటిచోట కూర్చుండును)

రంగ—(ఆగ్రద్దపై దృష్టియుంచి మెల్లగా దిగివచ్చి) అయ్యా ఆగ్రద్దకు
తెలియకుండా గ్రుడ్లను తెచ్చితి చూచితివా.

చిక్క—అయ్యా ఆగ్రుడ్లేవి

రంగ—యిదిగో (అని వడిచూచుకొని వెలవెలపోవును)

చిక్క—అయ్యా నివ్వెరపడెద వేమి.

రంగ—నావడికి బెజ్జముండుటచే యెక్కడనో పడిపోయినవి.

చిక్క—నావడియందున్నవి చూచితివా.

రంగ—(ఆశ్చర్యముతో) నీవడికెట్లు వచ్చినవి.

చిక్క—(నవ్వుచూ) గూటియందున్న గుడ్లు గ్రద్దకు తెలియకుండా
నీవడికెట్లు వచ్చినవో అట్లేనీకుతెల్యకుండాగుడ్లు నావడికి వచ్చినవి.

రంగ—బలే నాకన్నా నేర్పరివైతివి నిన్ను మెచ్చితి యీవజ్రాణము మే
మతుగా గొనుము. (అని యిచ్చును)

చిక్క—(అందుకొనును)

రంగ—మరచితి తమపేరేమి.

చిక్క—చిక్కయ్య.

రంగ—చిక్కయ్యగారూ యెల్లుండి మాఘశుద్ధ యేకాదశి అగుటవలన
స్త్రీలందరూ వుపవాసముండి వరదానదీ సామీప్యముననున్న కపి
లేశ్వరాలయమునకు సమస్తాభరణాలంకారలై వచ్చెదరు వారితో
పాటుమనమూ ఆఆలయమున దూరితిమేని మనకిష్టమైనంత ధనము
ను దోచుకొనవచ్చును. ఆఅగుపమునదియే నామీద అవుసరమున్న
యడల రహస్యముగా నటకేగుదెంచుచుండుము. నీవు మాకుమేటి
గానుండుము.

చిక్క—అటులనే పోయివచ్చెద శెలవా.

రంగ — పౌష్ణు వనమిద్దరమూ సోదరులముగా భావింపుము.

(తెరబడును)

చిత్ర — (ప్రాక్క దేప్రవేశించి) ఆ సీమంతినికి,

గీ॥ మొదల గొడ్డాణమును జూప • నెదుర నిలచి
తేని పరువులోవగ చెడు • నిట్లదిట్లు
గాన యొడ్డాణమును ముందు • గనుల జూపి
ముదము గలిగించి ఆపైని • ముచ్చటింతు॥

(అని నిష్క్రమించును)

{ తెరలేచును సీమంతినీ యిల్లు
విశంగి, సీమంతిని కూర్చొనియుందురు. }

చిత్ర — (ప్రవేశించి) వడ్డాణము సీమంతినికి చూపుచూ)

మ॥ ఉరురత్న ప్రకట ప్రభల్ వెలయు నీ • యొడ్డాణముల్ మంచి బం
గరుతో జేసిరి చూడు మిద్దిగోను మ • ల్కన్నాను మిట్లెన్ని యో
గిరమర్థిన్ గొని తెచ్చి యిచ్చెదను కా • న్కల్గాగ నింకైన న
న్మగు సామ్రాజ్యము నేల నియ్య వెదయన్ • మన్నించి సీమంతినీ॥

(అని సరసముబోయి యొడ్డాణమిచ్చును)

సీమం — (అందుకొని నడుమునకు పెట్టుకొని) నాథా దయామయుండ
వైన నిన్ను విడనాడిన దాదిగా,

ఉ॥ అన్నమహీష్టమయ్యె హృద • యంబున హెచ్చె విచారమేదియో
కన్నులు మూతలాపడవ • కారణమాంద్యము గల్గెనిస్సి ని
న్నన్నుబాయనైతి నిక • నెప్పటికిన్ విడనాడ నమ్ము మ
న్నన్న మదాపచారమున • కాగ్రహమంద కనుగ్రహింపవే॥

అట్లనుగ్రహింపవేని,

గీ॥ దిక్కుమాలినదాననై • దేవురింతు
దాన నీకపఖ్యాతియూ • దప్పబోదు

నిన్ను నేదైన నేనన్న • నేమునిన్ను
జంపుకొనినట్లు సుమ్మీ ని • ద్దంపుబాస॥

(అని కౌగిలించుకొనును).

విశం —(ముశిముశినగవుతో) అల్లుడూ చిక్కయ్యగారూ అనాను,

గీ॥ కూటికిన్నేని నూకలీ • కొంపలోన
లేనికతముని నిన్నట్లు • లేశమాట
లాడితిని విసుకున దాసు • లాచరించు
తప్పు లిదండమలసరి • దయదలంచు॥

(అని నమస్కరించును)

మస్తాన్ — (తెరలో) ప్యారీ సీమంతినీ క్యాకరీ తెహై బోలో

చిక్క — (ఆలకించి) అదిగో మస్తాన్ సాహెబు వచ్చుచున్నవాడు చీవాట్లు బెట్టి నాయెనుట వెళ్లిపరుముదువా లేదా.

విశం — ఆపని నావలనగాదు. (అని తెరలోనికిబోవును)

చిక్క — యేమీ సీమంతినీ నీవూ నీతల్లిబోయినట్లే పోయెదవా నాపౌరుషము దక్కింతువా.

సీమం — (భయముతో) నాథా ఆతురాత్ముని నెదిరగల సామర్థ్యము నాకడలేదు. మిమ్ముపిడచి పోవజాలను ఆపని మీరే కావింపుడు.

చిక్క — చెలీ అట్లైన ఆ చీపురుకట్టగొని వచ్చెద నిటనే యుండుము. (అని తెరలోనికిపోవును)

మస్తాన్ — (ప్రవేశించి) సీమంతినీ నీకీ యెంత పిలిచినా పల్కవు యేమి చేస్తుండావ్.

సీమం — సాహేబుగారూ యెందుకింతతొందర వస్తున్నారండి. (అని తెరలోనికి పోబోవును)

మస్తాన్ — (తడాల్నవచ్చి పైటచెరగుపట్టుకొని) చెలియా నన్విడచి యెక్కడికీ పోతావు ఖడో ఖడో (అని నడుమునకు చెయ్యి పోనిచ్చుచుండును)

చిక్క— (ప్రవేశించి కొడవలితో) ఒక చేత చీపురు ఒక చేత పేషుకబ్జ
పట్టుకొని) నాయుంపుడుకత్తెయగు నీకాంతను ఛీ

మ॥ వినురామ్లేచ్ఛ కులాధమాధమ నను౯ • వీక్షించి లేకున్ననిక౯
బుడమిన్ గూల్చెద కత్తితో నిపుడె ఛీ • పుర్కట్టుతుంజూడు మి
క్కడనీయాటలికేల బోడితలప్ర • క్కజ్జేతు నీ దెబ్బతో
గడుసుంబోకలమాని పొమ్ము ననుచి • క్కండడంచు భావింపరా॥

(అని చీపురుకట్టతో నెత్తినబాదును)

మస్తా౯— అరేబాపు చిక్కయ్య నన్ను చంపకురే నీకు సలాంచేస్తారే
(అని సలాంచేయును)

చిక్క— అరేమస్తా౯ యిది మొదలు యిక్కడికి రానని చెంపలు వేసికో
(అని వేయించును)

మస్తా౯— (అరేబాబూ నాదీహల్లాతోను యిఖయి క్కడికి రానురా బుద్ధి
వచ్చినదిరా॥

చిక్క— యికబొమ్ము యిటనుండకు.

మస్తా౯— అటులనే (తనటోపీ చేత బట్టుకొని వురుకుచూ తనలో)
యీబోగంది పెట్టుకున్న వడ్డాణము యీచిక్కడెక్కడనో దొంగ
లించినది గాబోలు లేకున్న యింతవెలగల దాతనికెక్కడిది యీసం
గతి రాజుగారితో చెప్పి వీరి నాసభకీడ్పించి కఠినశిక్ష వేయించెద.
నాసంగతి బాగా తెలియదు వీరికి తెలిసేటట్టు చేస్తా (అని నిష్క్రమించును)

(రాజసభ రాజు మంత్రి కూర్చొనియుందురు.)

రాజు— సచివవరా యిడవినుము.

చం॥ మనమున జంకులేక మన • మానితమా కపిలేశ్వరాలయం
బున గలదేవతాభరణ • ముల్గొనిపోయిరి దొంగలంచు మొ
న్ననె విని ధర్మకర్తవలన౯ • నిజమారసి నాకు దెల్పుమా
యనియనలేదె నీతో యది • యారయకుంటివి దేమి చెప్పుమా॥

మంత్రి— (లేచి నమస్కరించి) ప్రభువరా తమయాజ్ఞప్రకారమూ విష
యమంతయూ ధర్మకర్తవలన చారులవలన సమగ్రముగా నీరాత్రి
యే వినియుంటిని మనవిజేసుకొనెద చిత్తగింపుడు.

ఉ॥ క్షత్రియుఁడయ్యు చిక్కనృపతి • జారతనంబున భాగ్యహీనుఁడై
మైత్రిని దొంగలన్గలశి • మంచిపురంబుల దేవళంబులన్
కుత్రిమవేషభావములను • గొంకకదోచి తదర్థమంతయున్
మిత్రతఁబొంద వేశ్యకిడి • మింటచరించెను గుంటచిక్కులన్॥

ఆవేశ్య విళంగి బిడ్డయగు సీమంతిని యట దానికడ రత్నఖచితమైన
మంచివెలగల బంగారు యొడ్డాణమొకటున్నదట. యొడ్డాణముతో
దానినిటకు పిలిపించి విచారించిన అన్నివిషయములు సక్రమము
గా తేలును (అని కూర్చుండును)

రాజు— సచివవరా అట్లైన దానిని చారులవలన పిలిపింపుము.

మంత్రి— చిత్తము. (అని చారులచూచి) చారులారా మీరతిశీఘ్రము
గా యొడ్డాణముతో సీమంతిని పట్టుకొనిరండు.

భటు— చిత్తము (అని పోయి సీమంతినితో వత్తురు)

సీమం— ప్రభువరా నమస్కారము (అని నమస్కరించును)

మంత్రి— సీమంతినీ నీ మొలనున్న యొడ్డాణమిటు దెమ్ము.

సీమం— అయ్యా యెందులకు

మంత్రి— చూచుటకు

సీమం— అటులనా (అనితీసియిచ్చును)

మంత్రి— (అందుకొని) సీమంతినీ యిది యెక్కడ చేయించితివి

సీమం— యిది నేను చేయించినది కాదు.

మంత్రి— యెవరు చేయించిరి

సీమం— చిక్కయ్యగారు

మంత్రి— ఆయన చేయించిన నీకెట్లువచ్చినది.

సీమం— వేశ్యనగుటవలన నాకిచ్చినాడు.

మంత్రి— ఇది యెక్కడ చేయించినదియైనా యెరుగుదువా
సీమం— యెరుగను
మంత్రి— సరే నిలువుము (అని భటులనుచూచి) భటులారా మీరేగి
చిక్కయ్యను తీసుకొనిరండు
భటులు— చిత్తము. (అని తెరలోనికి పోయి చిక్కయ్యతో వత్తురు)
మంత్రి— చిక్కయా యీవేశ్య నెరుంగుదువా.
చిక్క— యెరుగుదును
మంత్రి— దీనికా యొడ్డాణమిచ్చితివట నిజమేనా
చిక్క— అవును యిచ్చితిని
మంత్రి— యీయొడ్డాణమెవరిది
చిక్క— యెవరిదెట్లువచ్చును మాతల్లిగారిదే
మంత్రి— యిదినీవు చేయించితివా
చిక్క— పూర్వమెవరు చేయించిరో నేచేయించలేదు.
మంత్రి— చిక్కయ్యగారు అంతకూర్చునుండు యొకబల్లచూపును
చిక్క— (వకబల్లపై కూర్చుండును)
మంత్రి— చారులారా కుముదవల్లిగారిని పిలచుకొనిరండు
చారు— చిత్తము (అని పోయి కుముదవల్లితో వత్తురు)
మంత్రి— అమ్మా మీపూర్వగ్రామమేదియో చెప్పగలవా
కుము— ఆవిషయమడుగుట అనవసరము
మంత్రి— అమ్మా యీచిక్కయ మీకుమారుడేనా
కుము— అవును
మంత్రి— అమ్మా యీరత్నస్థాపిత స్వర్ణమేఖల నీయదియేనా
కుము— అయ్యా యీనవరత్నఖచిత స్వర్ణమేఖలనాదియే యిదియేగురు
మంత్రి— అమ్మా యింతవెలగలయీవస్తువ యేమహారాజు భార్యయో
ధరింపవలసినదిగదా నీకెట్లువచ్చినది.

కుము— (దుఃఖముతో) అయ్యా నేనొక భూపతిభార్యనై దైవవిధితప్పి
తగవుబోని వేరంబొనర్చి నాఆస్తితో నాదాసీలతో భర్తచే పురం
బు వెడలింపబడి యిట్టి దుస్థితికి పాలైతినని దుఃఖపక సంతసింపగ
లుగుదునా.

మంత్రి— ఆరాజవర్యుని పేరేదియో చెప్పగలవా

కుము— (దుఃఖముతో) నాదు పురాకృతకర్మచే అట్టి మహాసామ్రా
జ్యపదవికి దూరస్థురాలనై నీచస్థితితో నుండి నానాథుని నామం బె
రిగించి వారివంశ కళంకం బొనరింపజాల నన్నేల పీడించెదరు.

రాజు—అమ్మా దుఃఖింపకుము పురాకృతకర్మ లెవరికిని అనుభవింపక
తీరదు (అని చిక్కయ్యను జూచి) చిక్కయ్యా యింత వెలగల యీ
యొడ్డాణము యీ వేశ్యకేల యిచ్చితివి యిది గైకొని యింటికేగుము
యీవృత్తి మానుము మంచివృత్తి బూనుము. (అని యివ్వబోవును)

చిక్క— (అందుకొనక ఖిన్నుడై)

ఉ॥ అక్కట క్షత్రియాన్వయము • నందుజనించి దురాపచారినై
మిక్కుటమైన మోహమున • మెచ్చి యొసంగితి నిద్ది యెట్టులో
జిక్కనటంచు గైకొనగ జెల్లునె • ధర్మమె యిట్లు జేయుటల్
కక్కినకూటికాసపడ గా • బరికించుట గాదె భూవరా॥

ఆవస్తువ ఆవేశ్యకే యిచ్చివేయును

రాజు— (నవ్వుచూ) చిక్కయా నీమనసుగనుగొనుటకిట్లంటినిగాని వేరు
గాదు. (అని వేశ్యనుజూచి) సీమంతినీ నీయొడ్డాణ మిదె గైకొనుము
(అని యిచ్చును)

సీమం— చిత్తము. (అని అందుకొని) (ప్రభువరా నమస్కారము (అని
నమస్కరించిపోవును)

రాజు— అమ్మా కుముదవల్లి యిక మీరింటికేగుడు (అనునంతలో తెర
బడును.)

(బసవేశ్వర మందిరములో బసవేశ్వరులవారు యుండగా
కొంతమంది భక్తులు శివపూజావిధానులై
కూర్చొనియుండగా తెర లేచును.)

బస— (ధ్యాన మభినయించుచూ)

మ॥ పరిణతాఘోర భవాటవీదహన ది • వ్యజ్ఞాన సూత్రార్థ ని
ర్గుణ విశ్వస్రుజన ప్రపోషణలయా • రూఢాక్షనిర్మాణ స
ద్గుణ దుర్మార్గహరేక్షణా శ్రితజన • స్తోమావనాపేక్షణా
ఫణిరాడ్భూషణ పార్వతీరమణ • శర్వాదీన సంరక్షణా॥

(పీఠముపైని కూర్చొండి జపించుచుండును)

చిక్క— (వకవైపుగోడ పెద్దధ్వనిగా కన్నము త్రివ్వుచుండును)

రంగ— (ప్రవేశించి) చిక్కయా దొంగతనమునకు వచ్చి కన్నాలేయు విధమిదియేనా యీ చప్పిడి యెవరైనా వినివచ్చిరేని నీ ప్రాణము నా ప్రాణము తీయురా చాలుచాలు మెల్లగా వేయుము. నేనావల కాపలాయుండెద (అని నిష్క్రమించును)

చిక్క— (కన్నములో ఆలకించుచూ కూర్చుండును)

యొకభక్తు— (ముద్ర నభినయించుచూ)

సీ॥ ఆధారచక్రమం • దలరారు మహనీయ
మాంపాహిమాం మోన్న • మశ్శివాయ

(ఆరువందలు జపించుచుండును)

యొకభక్తు— (ముద్రనభినయించుచూ)

సీ॥ స్వాధిష్టచక్రాన • చరియించు మహదేవ
మాంపాహిమాం మోన్న • మశ్శివాయ

(ఆరువేలు జపించుచుండును)

యొకభక్తు— (ముద్రనభినయించుచూ)

సీ॥ మణిపూరకంబునం • దణులైన మహనీయ
మాంపాహిమాం మోన్న • మశ్శివాయ

(ఆరు వేలు జపించుచుండును)

సీ॥ ఘనయనాహతచక్ర • మననుండు మహనీయ
మాంపాహిమామోన్న • మశ్శివాయ

(ఆరువేలు జపించుచుండును)

యొకభక్తు— (ముద్రనభినయింపుచూ)

గీ॥ అలవిశుద్ధచక్రమునందు • వెలగుచున్న
మహిత మాంపాహి మామోన్న • మశ్శివాయ

(వెయ్యి జపించుచుండును)

యొకభక్తు— (ముద్రనభినయింపుచూ)

గీ॥ మానితాజ్ఞేయ చక్రాన • బూనివెలుగు
మహితమాంపాహి మామోన్న • మశ్శివాయ

(వెయ్యి జపించుచుండును)

చిక్క—(కన్నము పెద్దధ్వనితో త్రివ్వుచుండును)

రంగ— (ప్రవేశించి) అయ్యో అయ్యో చిక్కయా యేమీ యింత పెద్ద ధ్వనిగా త్రివ్వుచుంటివి. యీరోజుతో నాకొంపా నీకొంపా ముంచబూనుకొంటివా యేమి (అని యీవలలాగబోవును)

చిక్క— (పెద్దగా) రంగా రంగా ఆగుమాగుము లోపల గంటారావములు శంఖారావములు మిన్నంటుచున్నయవి త్వరగా కన్నముత్రివ్వ లోపలికేగి చూడవలయును (అని వదలించుకొని కన్నము వేసి చూచుచుండును.)

రంగ— చిక్కయ్య యీరోజున నీకేమియో మూడినది. అదిగో వారందరూ నీవైపు చూచుచున్నట్లున్నది నేను పారిపోవుచున్నాను. (అని పారిపోవును)

బస— (ధ్యానముమాని గంటారావ మొనర్చి) భక్తవర్యులారా ఆనంద మానందము.

మ॥ ఆధారాది షడబ్జమండల మనా • యాసంబుగా దాటి పై
వేధానంద సహస్రమేఘఘటలీ • విద్యుల్లతాలింగ వా
రాధింపఁ బ్రణవధ్వనుల్సలిపి నా • రాయున్న దుద్యన్మనో
నాథుం డున్నతి సాధుమూర్తిగతి ప్రా • ణాయామ రామైక్యతన్॥

శ్రీమన్మహాదేవ శంభోశంకరా (అని శంఖముపూరించును)

(భక్తులందరూ శ్రీమన్మహాబసవేశ్వర సదాశివశంభో (అనిగంటా రావ మొనర్చి శంఖముల పూరింతురు)

చిక్క — శ్రీ మన్మహాబసవేశ్వర సదాశివ నమఃపార్వతీప తేన్న మోన్నమః (అని బసవేశ్వరు పాదంబుల వ్రాలి) మహాదేవా రక్షింపుము రక్షింపుము.

(భక్తులందరూ శంఖములట బెట్టినిలతురు)

బస — అయ్యో లెమ్ము లెమ్ము (అని లేవదీసి)

ఉ॥ ఏకులమందు నీవు జని • యించితి వెవ్వరు తల్లిదండ్రు లి
ట్లాకులపాటుతోడ చర • ణాబ్జములన్ బడనేల నిర్మలా
స్థోకమనీష రావిటను • చోరుడవై చనుదెంచినావు మేల్
నీకనుకూలమాధనము • నెమ్మదిగైకొను మిష్టగోత్రముల్॥

(అని పెట్టెవైపుజూపును)

చిక్క — (లేచి అంజలిఘటించి) స్వామీ నా దేశులమె నా తలిదండ్రులెవరో నేనెవడనో నాకు తెలియదు. ఆకులపాటుతో తమ పాదాబ్జముల బడితినని భావించితి రేల అట్లు కాదు. మొదల నీధనగోత్రంబుల నే చోరుడనై గొనిపోవ కన్నము వేసి తుదకా బుద్ధిమారి,

శా॥ ప్రాణాయామ పురాణమార్గమున సు • వ్యక్తిన్ సహస్రార గ
స్థాణున్గ్రొచ్చెడి మానసప్రభుల మిం • సాక్షాద్విరూపాక్షుల
క్షీణప్రాభవులంచు నెంచి భవనా • శీర్వాదమున్ గోరి తీ
క్షోణిన్ స్మేత్ఛ ధనంబు గైకొనెడి దీ • క్షోదక్ష దక్షుండనై॥

గీ॥ యిట్టి నామనోభీష్టంబు • నెట్టులైన
దీర్పకున్న నాప్రాణముల్ • దీసుకొందు
నిదియె పేర్మిఁ బ్రతిజ్ఞ తోడనో • యిందుశేఖ
రా శివా బసవేశ్వరా • రాపిదేర॥

(అని కత్తితో పొడచుకొన బోవుచు)

బస — (తడాల్న చెయ్యిపట్టుకొని ఆపి) నాయనా యింత తీవరించెద వేల

గీ॥ యింతనిమగ్నబుద్ధి నీ • కింతలోనె
గలుగుటానంద మొనఁగూర్చె • గానినీవు
పూజ్యమైనట్టి మోక్ష సా • మ్రాజ్యపదవి
కరతలామలకంబునై • గ్రాలువరకు
నిలువ నెంతువో నిలువవో • దెలుపుమయ్య॥

చిక్క — (అంజలిఘటించి) స్వామీ బసవేశ్వరా భక్తవర్యులారా నా దృఢాభిప్రాయ మాలింపుడు.

మ॥ దిక్కెల్లారిన లోకముల్ చెడగ వా • ర్ధివ్రాతముప్పొంగినన్
జిక్కల్గల్గిన మోక్షరాజ్యపదవిన్ • జేపట్టకే చిక్కడే
దక్కన్ ప్రేకల బోవగా దలపడు • ద్యన్మోక్షసామ్రాజ్య మీ
మ్రొక్కుల్గైకొని నాకుఁగూర్పరె దయా • మూల్యప్రభాభావులై॥

(అని మ్రొక్కును)

బస — నాయనా అటులైన యీమాటవినుము.

గీ॥ జారచోరత్వములుమాని • శాంతవృత్తి
శిరముబోనున్న పరనింద • సేయకితర
సతులతల్లులంచెంచు చ • సత్యమాడ
కిల నహింసతో నిలువగా • గలవె చెపుము॥

చిక్క — (అంజలిఘటించి)

గీ॥ జారచోరత్వములమాని • శాంతవృత్తి
శిరముబోయిన పరనింద • సేయకితర

సతులతల్లులంచెంచు చ॥ సత్యమాడ
కిల నహింసకో సిలతు వి॥ శ్వేశుసాక్షి॥

(అని మ్రొక్కును)

సదా — (ప్రవేశింపుచూ)

కం॥ నిరతానంద మయంబగు
పరమోక్షమునిచ్చు ప్రణవ॥ పంచాక్షరిన
మరరాదెవ్వగు మునిసుం
దరిహృద్వర్తి మహిత స॥ దాశివమూర్తి॥

(అని ప్రవేశించును)

బస — (లేచి) సదాశివయోగి సత్తమా నమస్కారము. (అని నమస్కరించి) అయ్యా ఆపీఠముపై గూర్చుండుడు (అనికూర్చుండబెట్టును)

(అందరూ) సదాశివ యోగిసత్తమా (అని నమస్కరింతురు)

బస — అయ్యా యీతండు చిక్కయయట తస్కరుండైవచ్చి మోక్షజ్ఞానోపదేశ మిమ్మని బాధింపు చున్నవాడు యితనికి యివ్వ వచ్చునా యివ్వగూడదాయని విచారింపుచుంటిమి॥

సదా — బసవేశ్వరా యితనికి కారణమిచ్చుటకు సంశయంబేటికి యిమ్ము యితని విషయమంతయూ రహాస్యము. సమయముగునపుడు చెప్పెద. ముందు మనమీతనివలన చాలాయశస్సు నందగలము యితండు శివవరప్రసాది సామాన్యుడుగాడు.

(అను నంతలో తెరవ్రాలును)

తృ తీ యాం క ము.

సమాప్తము.

---

శ్రీరస్తు.

# నిజలింగచిక్కయ్య

## చతుర్థాంకము.

{ కుముదవల్లి, గౌరి, నిజలింగ చిక్కయ కూర్చొనియుండగా తెర లేచును. }

కుము — నాయనా యీ తెల్లవారు నంటిలోనె

సీ॥ జారాంగనప్రియా • సక్తచిత్తము నెట్లు
మార్చి మోక్షాంగనన్ • జేర్చితీవు
చౌర్యధనార్జనా • చారచిత్తము నెట్లు
మార్చి మోక్షార్థమున్ • జేర్చితీవు
దుష్టమైత్ర్యాదిరక్త • నష్టచిత్తము నెట్లు
మార్చి మోక్షాధ్వంబు • జేర్చితీవు
టక్కరివేషాల • జిక్కుచిత్తం బెట్లు
మార్చి సద్వేషమున్ • జేర్చితీవు
గీ॥ మదనమంత్రప్రసక్తమౌ • మనము నెట్లు
మార్చి ప్రణవ పంచాక్షరిన్ • జేర్చితీవు
దెల్పుమా సమాచారమున్ • దేటపడగ
వినగుతూహల మయ్యెనో • వరపితండ్రి॥

(జని దగ్గరకు తీసుకొనును)

చిక్క — అమ్మా యీ రాత్రి చోరవేషంబున బసవేశ్వరు మందిరమునకు కన్నమేసి ఆ కన్నములోనుండి యేచూచుచుండ ఆపూజామంటపము.

గీ॥ అగరుసాంబ్రాణి వాసన • లావరించి
భక్తతతికెంతొ హాయిగా • బరగువన్న

పూలతోడ నలంకార • పూర్తి జెలగి
మోదముగూర్చెను కైలాస • మోయనంగ॥

తల్లీ ఆలంకార మంటపమున,

సీ॥ రౌప్యపీఠాకృతి • రజతాచలముగాఁగ
పవడాలసరములే • ఫణులుగాఁగ
వామభాగస్థిత • భార్య పార్వతిగాఁగ
తిలకంబుఫాలనే • త్రంబుగాఁగ
కాషాయచేలముల్ • గజచర్మములుగాఁగ
లలితదండము త్రి • శూలంబుగాఁగ
నమలశిఖారత్న • మంబుజారియుగాఁగ
నటభక్త తతిబ్రమ • దాళిగాఁగ

గీ॥ గంటసంకుస్వనంబులే • కాద్యులల్ల
వేదఘోష నిరాజన • విధులుసెలఁగ
నలరు బసవేశ్వరునిగాంచి • యాత్మలోన
నారసాక్షాద్విరూపాక్షు • డంచు నెంచి॥

తడాల్నబోయి వారి పాదాబ్జంబులంబడి మోక్షధనంబు గైకొన నుంకించినీనిగాని ఆసమయము అసమయమైతోచె

క్షమ—(సంతోషముతో) నాయనా యెందువలన

చిక్క-అమ్మా అటగల భక్తులందరూ పద్మాసనాసీనులై ప్రాణాయామమార్గంబున ఆధారచక్రంబునకు కొందరు స్వాధిష్ఠానచక్రంబునకుకొందరుమణి పూరకచక్రంబునకుకొందరు అనాహత చక్రంబునకుకొందరు విశుద్ధ చక్రంబునకు కొందరు ఆజ్ఞేయ చక్రమునకు కొందరు మానస హంసను నడపి కుంభించి ప్రణవపంచాక్షరీ మంత్రంబును నియమపూర్వకముగా జపించుచుండిరి. రత్నస్థాపితమైన రజితపీఠముపై పద్మాసనాసీనుడైన బసవేశ్వరస్వామి యీమార్గముననే షట్చక్ర

ములదాటి బ్రహ్మరంధ్రమనుసూక్ష్మద్వారమున సహస్రారమునకు మానసహంసను జేర్చి కుంభించి అమనస్కులై నిర్వికల్ప సమాధి జెందెను. అట్టిసమయమున తపోభంగమౌనని వెంచి నిశ్చేతనాని యుండనై కన్నమునందే నిలచితి అంత కొంతవడికి వారు సమాధుల నుండిలేచి ఘంటారావములు శంఖారావములున్నట్లునట్లు సల్పిరి నమ్మహాధ్వనికి స చేతనుండనై బసవేశ్వరు పాదంబుల వ్రాలి వారె న్ని జెప్పిననూ వినక మోక్షధనంబిమ్మని ప్రార్థించగా యిచ్చుటకు సంశయించుచుండిరి యింతలో మహాత్ముగా నన్ను రక్షింపవచ్చిన పరమేశ్వరుండో యన్నట్లు సదాశివయోగివర్యులట కేతెంచి వారి సంశయంబంతియూ బాయునట్లుదియో బోధించి అంతర్థానము నొందె. అంత బసవేశ్వరుండు నుదీప్తితంబీడేచ్చి నిజలింగచిక్కయ్య యను నామంబిడి యీపవడాలవ్యాపారంబున జీవింపుమని బంపిరి.

కా ము — హే సదాశివయోగివర్యా బసవేశ్వరా (అని ప్రాంజలియై ధ్యానించును)

గౌరి — హే సదాశివ యతిసత్తమా హే బసవేశ్వరా (అని భర్త పాదంబుల వ్రాలును)

చిక్క — (నిశ్చేతనుండగును)

కుము — (గౌరినిలేవదీసి) కుమారరత్నమా నీభార్యకీ పవిత్ర పంచాక్షరీమంత్రముపదేశించి రక్షింపుము.

చిక్క — ఉత్తమము. (అనునంతలో తెరవ్రాలును)

{ చిక్కయ పవడాల సంచితో నిలచియుండగా తెర లేచును. }

చిక్క — హా బసవేశ్వరా సదాశివమూర్తి యీపవడముల గొనునూహా యొకరైననూ చూపించరైరి యీ పవడముల మహిమ లందరికీ గోచరించునటుల కేక వేసిచూచెద యెవరైనావచ్చి కొనెద రేమొ.

సీ॥ ఆధారచక్రాంగ • నాలింగనీషవ
డాలు మోక్షాక్షరా • లోలిగొనరె
స్వాధిష్ఠచక్రాంగ • నాధీనతీ షవ
డాలు ముద్రాక్షరా • లోలిగొనరె
మణిపూరకాంగనా • మలయుణి ఘృణిషవ
డాలు ధ్యానాక్షరా • లోలిగొనరె
అయునాహతపని • తాధరమ్మృతిషవ
డాలు షంచాక్షరా • లోలిగొనరె
గీ॥ భువిశుద్ధాంగనా సక్తి • షవడములివి
షహితాజ్ఞేయ మోహిని • షవడములివి
స్థిర సహస్రార సంస్థైర్యఖ్య • శివునిజూపు
షవడములివి గొనరమ్మ • బ్రిస్తుతింతు॥

(6వ అనుబంధము)

రంగ— (ప్రవేశించి) అయ్యో ఆఅమ్మునవి యేమిటి.

చిక్క— (తిరిగిచూచి సంచి క్రిందబెట్టి కౌగలించుకొని) తండ్రి నన్ను మరచితివా నేను నిజలింగ చిక్కయనుగా నాసేనమ్మునవి బసవేశ్వర షవడాలు.

రంగ— (సంతోషముతో) నాయనా చాపుదప్పించుకొని బైటబడి నా కన్నుల పండు వొనర్చితివా.

చిక్క— తండ్రి నీదయవలననే మృత్యుంజయుడనైతిని.

రంగ- నాయనా మొగముదప్పించి వచ్చితనని నాపై కోపమూనితివా.

చిక్క— లేదులేదు నన్ను రక్షించిన వానిపై కోపమూనుటయునా.

రంగ— నాయనా నేనేమి రక్షించితిని

చిక్క— తండ్రి నీవు నన్ను రక్షించిన విషయము చెప్పెద నాలింపుము నీవు నేర్పిన విద్యవలననే గురుమూర్తి కరుణవశశి దివ్యపంచాక్షరి గైకొంటిని నీవు యీ మంత్రోపదేశమొంది తదేక ధ్యాన పరాయ

నుండ వైతివేని ముక్తికాముండవై దుష్టసంసార సాగరతరంగముల కలంకుజెందక అనాయాసంబుగా దాటి మోక్ష సామ్రాజ్య శ్రీశ్వ రునందైక్య మందెదవు.

రంగ — తండ్రీ! అటులనా నాకీమంత్రంబుపదేశించి నన్ను రక్షింపుము. (అని పాదంబుల వ్రాలును) (తెరబడును)

{ రాజసభ రాజు, మంత్రి కూర్చొనియుండగా తెరలేచును. వకభటుడు. }

చిక్క — (లోపలయుండి) సీ॥ ఆధార చంక్రాంగనా (అను పద్యము చదువును)

రాజు — సచివాగ్రణీ ఆపవనములనున్న వానిని పిలుపింపుము

మంత్రి — చిత్తము. (అటుని భటునిచూచి) భటా వానిని పిలచుకొనిరమ్ము.

భటు — చిత్తము. (అనిపోయి చిక్కనితో వచ్చును)

రాజు — (చిరునవ్వుతో) చిక్కయా ఆయాసన మధిష్టింపుము.

చిక్క — చిత్తము. శ్రీ బసవేశ్వరస్వామికీ జై!! (అని కూర్చుండును)

రాజు — చిక్కయా క్షత్రియాన్వయుడవై యీ వృత్తి ?గానితివేల యీ వృత్తినివదలి మనకులాచారవృత్తిని బూనుకొనుము.

చిక్క — అయ్యా తమయాజ్ఞాబద్ధుండనేగాని మనకులాచార వృత్తికి

మ॥ ప్రథమోద్యోగము శత్రులద్దునుము టా ● పైరాజ్య సంపాదనా
విధియా పైపరి పాలనాస్థకలిలా ● భీల ప్రమాదాక్రమో
దధిమప్పాతము దాన దండధర శ ● స్త్రాగ్రస్త శిక్షావిధీ
విధమైయొప్పెడి దానినేలగొన భా ● వింతుర్ ధరా నాయకా!

యిందువలననే

కం॥ చింతింపగ వ్యవహారము
లంతుద్రైలమి నధర్మ ● మా ధర్మంబా
వంతల్ దుష్టిర్పల్ రా
జ్యాంతే నరకం ధ్రువమని ● రార్యుల్ ధుర్యుల్॥

యిట్టి దుష్కర్మ పూరితంబయిన రాజ్యం బపూజ్యంబని భావించి
యీ రాజవేషము వేయక

సీ॥ నిర్మలజ్ఞాన సంపూర్ణ • నిధిగ వెలయు
బసవలింగని పాదముల్ • బట్టిముక్తి
భుక్తి నొసగూర్చు వేషమె • బూనినాడ
బ్రీతి నిజలింగ చిక్కయా • భిక్ష్యకోడ॥

రాజు— అటులనా నిజలింగ చిక్కయా యీ వేషమున భుక్తియూ ముక్తియూ యెట్లు గలుగునో చెప్పగలవా

చిక్క— అయ్యా గురుదేవుని యాజ్ఞప్రకారము దుష్కర్మ లాచరింపక నిత్యసత్య వ్రతాచారంబులతో భగవన్నామస్మరణ జేయుచూ తదేకధ్యాన చిత్తుండనౌటచే ముక్తియూ అబసవేశ్వరుని యాజ్ఞప్రకారమే సరియైన ధరకు పనడాలనమ్ముచూ వారి సొమ్ముబోను మిగిలిన లాభ మనుభవించుచుండుటచే భుక్తియూ గాంచుచుంటిని యీపవడముల ధరించి నిత్యోదయ స్నానసంధ్యానుష్ఠానుండనై

మ॥ అరిషడ్వర్గగజాంకుశం • బభవజీ • వైఖ్య ప్రదావశ్య సం
స్మరణీయప్రమదావహంబు హృదయాం • చత్సంచలధ్వాంత భా
స్కర తేజంబ చలస్వరూపము లస • త్సౌఖ్య శ్రేయంబాశ్రితా
దరకల్పద్రుమమంత్రమూర్తి నెపుడున్ • ధ్యానింతు పంచాక్షరిన్

యిందువలన నేను సుఖదుఃఖంబులనంటక నిత్యానంద మయుండనై ప్రాణాయామ రథారోహణుండనై సుషుమ్నమార్గమున సహస్రారమను సదాశివు సదనంబుజేరి అందు నామహాదేవు పూజించి జీవభావ ముపసంహరించి యీశ్వర భావుండనై సర్వైశ్వర్యతురీయానంద సామ్రాజ్యాభిషిక్తుండనైన నేనీతుచ్ఛ భోగంబుల కాశించి జీవహింసాపయుక్తంబును అశాశ్వతంబును అసత్యాచారంబును నారకపూరితంబునగు యీరాజ్యమాసించు టెంతటి హీనభావమో మీరే యోచింపుడు॥

రాజు — (సమీలిత నేత్రుడై) నిజలింగ చిక్కయ్యా మహాత్మా నీకిదివరంలో రాజడిన దుర్భాషకనుబట్టి యీ వేషమంతయూ టక్కరి వేషమని భావించితినిగాని నీవట్టి వేషధారివిగావు నీపూర్వపుణ్య భాగ్యంబెన్న నేరితరము నా నేరములెన్నక దయాపూర్ణ భావుండవై ప్రణవ పంచాక్షరి నుపదేసించి మమ్ము రక్షింపుము. (అని అంజలిఘటించి లేచును అందరూ లేతురు.)

చిక్క — (లేచి ప్రభువరా శ్రీ బసవేశ్వరస్వామి యాజ్ఞ ప్రకారము యీ పవడాలదండ మీకు ధరింపనిచ్చి ఆవల ప్రణవపంచాక్షరీ మంత్రోపదేశ మొనర్చెద (అని సంచివిప్పి పవడాలదండను రాజుగారి మెడలో వేయును)

రాజు — (సంతోషముతో) మహాత్మా మీరలందరకొక్కొక్క దండ ధరింప నివ్వుము.

చిక్క — చిత్తము. (అని తలావకదండ యిచ్చును)

(అందరూ ధరింతురు)

రాజు — సచివవరా వెయ్యిరూప్యంబుల తెప్పింపుము.

మంత్రి — చిత్తము (అని లోపలికేగి రూపాయీల పళ్లెరముతో వచ్చును)

రాజు — (అందుకొని చిక్కయకడకువచ్చి)

మ॥ దనివిన్ మాకు ధరింపనిచ్చు పవడా ♦ ల్దండల్దరస్మిను చం
ద్రునికిన్ నూలిపురీతినిత్తు గొనుమిం ♦ తో ప్రీతి కొండంత దే
వుని కొండంతటి పత్రితోడ పృథివిన్ ♦ పూజించు వారుందురే
మనసారన్వచియింపుమయ్య విమలా ♦ త్మజ్ఞాన దివ్యాధిపా॥

(అని చిక్కయ్య కివ్వబోవును)

చిక్క — (అందుకొనక)

మ॥ అమితార్థంబు బరిగ్రహింప గురునా ♦ జ్ఞాతిక్రమోత్సాహినై
క్రమమున్దప్పి చరింపనుంటినె సుచా ♦ ఖ్యాప్రౌఢి మెప్పించి య

కర్మసంపాదనసేయబూనితి నే నొ • క్కం బింతనాకేల ప
కర్మమూల్యంబిడి పంపుడయ్యా నను ని • ష్కర్షన్బరీక్షింపకన్॥

(అని సంచితీసుకొని పోబోవును)

రాజు—(అడ్డమువచ్చి) అయ్యా తమచిత్తంబు పరీక్షింప నంతటి సమర్థుండగాకుండినను తమ నిరాశాభావమీ యెల్లరకూ విశదంబగునట్లు జేయుట యుత్తమమని యోచించి యిట్లాడితి నిది నాయపరాధముగా భావింపక క్షమింపుడు కృతార్థుల చేయుడు. (అనినమస్కరించును తెరబడును)

(తెర లేచును వేశ్యల గృహములు).

చిక్క—(తనలో) ఆహా యీజనులెల్లో

గీ॥ జచ్చిపుట్టుచుండు • జన్మలెన్నెన్నియో
నరకబాధ లోడ • పరిఘటించు
కర్మవలనె జన్మ • గలుగుచుండునుగాని
వేరుగాదు వినుడి • వెఱ్ఱిలార॥

సీమం—(నవ్వుచు ప్రవేశించి చిక్కయ్య చెయ్యిబట్టుకొని) చిక్కయ్య బావగారూ యీ వేష మెప్పటినుండి ధరింపుచుంటిరి. యీ వేషమునకు పేరేది.

చిక్క—అమ్మా సీమంతినీ యీ వేషమునకు నామమేమను చుంటివా.

గీ॥ నరకకూపాంధకార బం • ధురనివార
ణానువేషాభిధానము • నూనమోక్ష
రాజ్య సంపాదనాత్మ వి • రాజమాన
మమలపంచాక్షరీ ధ్యాన • మమరు కతన॥

యిట్టి నిజలింగచిక్కయనా బరగు వేషమును ధరించి యీమంత్రముపఠించు మహద్భాగ్యము నాకుగూర్చినది నీ వేగాన నానమస్కారము గైకొనుము (అని నమస్కరించును)

సీమం — (చిక్కయ్య చేతులబట్టుకొని) అయ్యా చిక్కయ్యగారూ మీకు పిచ్చిపట్టి మతిచెడిపోయినదా యేమి చాలు చాలు మీరు గొప్ప వారయ్యా నాకు నమస్కరించెదరేల యీ వేషంబుల వేసి మాపటి పూట వేశ్యాగారంబుల రహస్యముగా సంచరించు వారల ననేకుల జూచుచుంటిని యీ వేషంబులు నేనెరుంగనివిగావు యీ వేషంబున నిన్నెరుంగని వారిల బొంకింతువుగాని నిన్న మొన్నటిదాక త్వత్సంగతినైన నన్నెట్లు బొంకింతువు అయిననూ యింతకు ముందుగా చదివిన పద్యము చదివి నాకు వినిపింపుము.

చిక్క — గీ॥ చచ్చిపుట్టుచుండు (అనుపద్యము (చదువును)

సీమం — అయ్యా కర్మవలననే జన్మ గలుగునని చదువుచుంటిరే యిది నిజమైన వాక్యమేనా

చిక్క — యెందుకుగాదు నిజమైన వాక్యమే

సీమం — చిక్కయ్యబావగారూ అటులయిన

మ॥ జగతిన్గల్గెడి జన్మకర్మముల గాంచ ముందు కర్మేయనన్ దగునే జన్మయె లేని కర్మలెటులై ద్దానన్గలుంగుగ భరిం పగనెవ్వారలో జేయ వీరికెటులా పాదించు జన్మేయనన్ దగుసాక్ష్యంబుగ కర్మగల్గవలెగా దా యేది ముందందునో॥

యీవిషయము కొంచెము చెప్పుము.

చిక్క — (చిరునవ్వుతో) తల్లీ

మ॥ సమభావస్థితి తోడ నన్నడుగ నో జన్మెప్డునున్దాని దు
ర్గమ దోషుల్పొడ వాదనన్గరుప ని త్యాముంను చెట్టౌనచిం
పుమటంచాడెడి రీతి నాడదగు నే ర్పున్గాప నేనెట్టులీ
క్రమమున్దెల్పెద నిట్టివాదనల నే కామ్యార్థముల్గల్గెడిన్॥

యేటికీ వృధా వాగ్వాదము అయిననూ కర్మవలన జన్మగలుగునని గదా నేనన్నయది ముందు రానున్న కర్మానుసరణిగా జన్మవచ్చుట బద్ధమా.

సీమం— యి మాటయూ అబద్ధమనియే నా భావము యేమన్న

గీ॥ ముందువచ్చు కర్మ • లెందునవసియుంచి
వచ్చువానిబట్టి • బాధసలుపు
వచ్చువాడెవండు • వానికీ కర్మల
శ్లేషహామెట్లుగలిగె • చెప్పుమయ్య॥

చిక్క—తల్లీ యిట్లుసమంజసముగానడిగిన నాకుదోచినట్లు జెప్పకుందునా

గీ॥ ముందుకర్మప్రాణి • యుండెనిలచి
వచ్చువాని బట్టి • బాధసల్పు
వాడె జీవుడల్ల • వానికీకర్మల
శ్లేషహామెన్న మాయహ • యూహగాదె॥

సీమం— స్వామీ అట్లైన

గీ॥ జీవు డెరూపుతో నెందు • జెలగుచుండు
జన్మమేరీతిదాల్చునా • జన్మకర్త
మోహమాయూహ సెట్లగాంచు • మూలమేది
చెప్పిరక్షించు నిజలింగ • చిక్కయాఖ్య

చిక్క—తల్లీ చెప్పెద నాలింపుము.

గీ॥ చిత్స్వరూపుండు జీవుడా • స్త్రీ పురుషుల
సంగమోద్భూతరుధిర తే • జస్సులందు
నిలచి పిండమౌ చాకార • నియతుడగుచు
మాతృగర్భాన తెపియించి • మహినిబడియు
మోహకర్మ చరిష్ణుడౌ • మూలమిదియె॥

(అని ముఖవస్త్రమేసి) తల్లీ యీవిషయంబంతయూ దృగ్గోచరంబగును వీక్షింపుము.

సీనుం— చిత్తము. (అని ధ్యాన మభినయించుచుండును)

(దాగివినుచున్న వేశ్యలందరూ ప్రవేశించిఅంజలిఘటించినిలతురు)

విశం— (ప్రవేశించి కూర్చుండును)

సీమం — ధన్యాస్మి ధన్యాస్మి నేనెంతటి ధన్యురాలను మహాత్మా (అని
చిక్కయ్య పాదంబుల వ్రాలును)

(అందరూ సాష్టాంగపడుదురు)

చిక్క — (సీమంతిని లేవదీసి) తల్లీ నీయభిప్రాయ మెద్దియో వెల్లడింపుము
(అందరూ లేచి అంజలిఘటించి నిలతురు)

సీమం — అయ్యా మహాత్మా

ఉ॥ చేసితి నీతిమంతులను • చిత్తవికారత సంచరింపగా
జేసితి నర్థవంతులను • జీర్ణదరిద్ర విధిన్ గృశింపగా
జేసితి రాజరాజులను • సేవకులై వసియింప నెన్నియో
జేసితి క్రూరకర్మలను • సిగ్గుమపిడి ధనార్జనార్థినై॥

మహాత్మా

చం॥ వినుముదురాపచారకుల • వృత్తి గడించిన యర్థమంతయున్
మనసిజవాంచచేత చెడు • మంచి నెరుంగని మానసంబు నే
దనరగహీన కార్యశిఖ • దాహవిధిన్బడు నీ శరీరమున్
గొనియెటు లుత్తమస్థితికి • గూర్చెద వర్షణ జేసితిత్తరిన్॥

(అని తనశరీరమందున్న వస్తువులనన్నియూ నిలువుదోపుగా నొలచి
యొక పళ్లెరమందుంచి చిక్కయ్య పాదంబులకడబెట్టును. అందరూ
అట్లే చేయుదురు)

విశం — (లేచి బిడ్డనుజూచి) అమ్మాయీ

ఉ॥ తాపసునైన మోహమున • దార్కొన జేసి ధనంబులాగు స
ద్వ్యాపకముండగా వలయు • వారకులాంగన కిన్ని నీవు దు
ర్వ్యాపకవై ధనంబిటుల • పాడొనరించెదె • చాలుచాలు నీ
ప్రాపును గన్న వీరలును • బాల్పడి రీవు చరించురీతికిన్॥

(అని ఆవస్తువుల పళ్ళెరమందుకొనబోవును)

సీమం — (తల్లి నావలకు లాగి కోపముతో)

ఉ॥ హెచ్చుగ నేండ్లను న్గలుగ • నేమిఫలం బిపుడీవుగూర్చి మా
కిచ్చిన సొమ్ము లేదకట • యువ్వరునీయది దాచుకొమ్ము నీ
జచ్చెడి వేళ రక్షణము • సల్పగ వెంటనె • వచ్చునమ్ము పొ
మ్మిచ్చట మాటలాడ తగ • వెంకున బుద్ధి విహీన పొటచే॥

యిందు నా తెలివి నేమి గ్రహించితివి.

సీ॥ ఆస్థిరార్థమునిచ్చి • సుస్థిరజ్ఞానార్థ
మునుగొనెదుచ్చాహ • మూనినాను
దరిలేని భవరోగ • భరితాంగమర్పించి
దివ్యాంగమునుగొన • దివిరినాను
చంచలమానసం • బంచితంబుగనిడి
యచలమానసమంద • నలరినాను
స్మరియింపగారాని • మాటలన్విడనాడి
మణిమంత్రములుగొన • మరగినాను

గీ॥ విటులవరియించు బుద్ధిప • విడినాను
మోక్షపురుషుని వరియింప • గానినాను
మానుమని యన్న నిథ్యాస • మానబోను
పూని నీబోధలనుజొచ్చి • రానురాను॥

(అని విళంగిని తెరలోనికి నెట్టివైచును)

చిక్క — (తక్కినస్త్రీలను చూపుచు) సీమంతినీ

గీ॥ ఆది శూరత్వమునుజూపు • చంత్యమునను
బేల లౌభటుల పగిది • వీరలటులె
మొదల నిశ్చయం బేజూపి • తుదకుబేల
లౌదురేమో గనుంగొన • నానదూక్తి॥

సీమం — అయ్యా మహాత్మా

గీ॥ యింతనిష్కర్ష బుద్ధితో • నెసగువీరు
తుచ్ఛభోగాభిబనుటకు • నిచ్ఛపడరు

కామధేనువు పాలను • గాంచువారు
వేరు ఖరముల పాలను • గోరనట్లు॥

చిక్క — అవును అయినను

గీ॥ వారి వార లేరైనని • వారణంబు
సేయు నీబుద్ధి మానగా • చిత్తమందు
దలతు రేమో యదార్థంబు • దెలియవలయు
వారి భావార్థములవారె • బలుకవలయు॥

సీమం — చిత్తము. (అని వారివైపుజూచును).

(అందరూ అంజలిఘటింతురు అందులో నొకర్తుక) మహాత్మా మా మనోనిశ్చయ మాలింపుము.

చం॥ వలదని తల్లిదండ్రులతి • బాధ్యగా వచియింప నిమ్ము మా
తలలను దీయ భూమిభుజు • దార్కొననిమ్ము నిరాదరార్తదు
ష్కలితము గల్గనిమ్ము విభ • వంబులు పోయిన బోవనిమ్ము ని
శ్చల పరతత్వబోధగన జా • లనిభావము లూనమెందునన్॥

(అని యంతనే యందరూ పాదంబుల వ్రాలుదురు)

సీమం — (సంతోషముతో) తండ్రీ యికనైనా యీయర్థంబు గ్రహించి పంచాక్షరీనుపదేశించి మమ్ము రక్షింపుము

చిక్క — అమ్మా యీయర్థము గైకొనకనే మీకుపదేశమిచ్చెద

సీమం — తండ్రీ యీహేమ్ము నేల గొనవు

చిక్క — తల్లీ చెప్పెదాలకించుము

గీ॥ బసవదేవునియాజ్ఞ నీ • పవడములను
దండలుగ శిష్యవితతికం • దరములందు
వేల్కనిడివాటికిదగిన • వెల నెగొనుచు
నుంటి నిటనైననమితార్థ • మంటకుంటి॥

కావున నేను మంత్రపూర్వకముగా మీకిడబోవు పవడాలదండలకు

తగుమూల్యముగైకొనద తక్కిన సొమ్ము బ్రాహ్మణ సమారాధనల
కర్పింపుము.

సీమం— అయ్యామహాత్మా

మ॥ వెలగానిచ్చితిమంచు నెంచవలదీ • విత్తంబు మాయిష్టమై
నిలుపన్నోపుగ మానసాంగములతో • నిష్ఠన్సమర్పించినా
మలయాచార్య సమర్పితంబయిన యీ • యర్థంబు మాకేల ని
ర్మలసన్నైకొని కర్చుబెట్టుడభవా • ర్థంబట్టి కార్యాళికిన్॥

చిక—అట్లే సదాశివ కళ్యాణ మహోత్సవాదులకు కర్చుబెట్టెద
గాని ముందు మీరలీ పవడాలదండల ధరింపుడు (అనితలావకదండ
నిచ్చును) (అందరూ ధరింతురు)

సీమం—తండ్రీ ప్రణవపంచాక్షరీ మంత్ర ముపదేశించుము. మమ్ము
రక్షింపుము.

చిక—అట్లే (అని ముఖవస్త్రము వేయబూనును)
(తెరవాలును)

{ కళ్యాణపురిము లలితాంబాలయము
లలితాంబ కూర్చొనియుండును తెరలేచును. }

లలి—(విచారముతో) హా పరంధామా పద్మోద్భవా నీవెంతటి పక్ష
పాతివి.

ఉ॥ భూమిని భామినీమణుల • బుట్టగజేసి యధేశ్చనేగెడు
ధ్ధామ స్వతంత్రతన్విడచి • దైవ్యవిధిన్ జరియించునట్లు ని
ర్ధూమ మహోజ్జ్వలాగ్ని సమ • దుష్టునకోహారు నాజ్ఞగూర్చితీ
వేమి ఫలంబుగైకొనద • వేటిదురాకృత ముచ్చరింపుమా॥

అంతబాక

సీ॥ విద్యాభిలాషకు • విద్వాంసునేసను
కూర్చక విద్వాంసు • గూర్చెదేల

అర్థాభిలాషకు • యర్థవంతు నెనము
కూర్చకతి దరిద్రు • గూర్చెదేల
నిష్టాభిలాషకు • నిష్టవ్రతునె సమ
కూర్చకనిష్ఠుని • గూర్చెదేల
సుగుణాభిలాషకు • సుగుణాఢ్యునే సమ
కూర్చకయవగుణు • గూర్చెదేల

గీ॥ సొగసుగత్తెకు దగినట్టి • సొగసుకాని
నెసమ కూర్చకందవి హీను • నిసమగూర్చె
దేల యిట్టి నీసేతకే • స్త్రీలుతగిరి
పురుషులే యైన నీతల • పురెద్రియరె॥

యిట్టి దుష్కృత్యుండ వౌటవలననే యిదివరలో

మ॥ తనభక్తేయని నిన్ను జేరు గిరిజాం • తర్భావమూశంభుడా
త్మనుయోచించి శిరస్సులందొకటి దు • న్మార్గ హీన శీర్షుండ వం
దునపూజావిధు లుండవయ్యె జగమం • దున్నీకు నికింక దు
ర్గుణమేలావిను ముత్తమస్థితిని ని • గ్గున్నేలు స్తుత్యార్థివై॥

చతురాననా యొకరిసంగతి నాకెందులకు నావిషయ మెట్లు జేసితివో చూడుము.

సీ॥ కనకాంగినౌ నాకు • కనుమల్లవాని
భర్తగాగూర్చితే • పౌరిషి చెపుమ
చదువరిసౌనాకు • చదువనివానిని
భర్తగాగూర్చితే • పరిక్షచెపుమ
సరసాత్మనౌనాకు • విరసాలవానిని
భర్తగాగూర్చితే • పరువు చెపుమ
శృంగారనౌనాకు • ఖంగారువానిని
భర్తగాగూర్చితే • పాడి చెపుమ

గీ॥ చిక్కుజాలవు జెప్పెదీ • సృష్టి మహిమ
దంపతుల కనిష్టములావ • రింపు చవల
మెల్ల మెల్లగ వ్యభిచార • ముల్లసిల్లి
తుదకు కిల్బిషాంబోధిలో • ధుముక జేయు॥

చిక్క— (సంధితో ప్రవేశించి) సీ॥ ఆధార చంద్రాంగనా (అనుపద్యము చదువును)

లలి— (ద్వారమీవలకు వచ్చి చిక్కయ్యనుచూచి తనలో) ఆహాయీ సుందరాకారుడెవ్వడై యుండనోపును

సీ॥ కమలాసనుండన్న • కాదీతనికి లేవు
నాలుగుమోములు • శూలియేమొ
కాలకంధరుడన్న • కాదీతనికి లేవు
మూడుకన్నులవిష్ణు • మూర్తియేమొ
కమలనాభుండన్న • కాదీతనికి లేవు
శంఖుచక్రంబులా • చంద్రుడేమొ
కంజారి యేయన్న • కాదీతనికి లేవు
మెచ్చతగ్గుకళ • లిందుడేమొ॥

గీ॥ యిందుడేయనుకొన్న కా • దీతనికిస
హస్రలోచనములు లేవ • హాశరీర
మందనూనమోహనరూపు • డౌనితండు
మదనసృష్టినిజనియించు • మానవుండు॥

నిజముగా యితండబ్జసంభవుని సృష్టిలోనివాడు కాడనియే నాభావము. యితని నెట్లులైన పదపదములనైను నెపమున బిలచి నయనోత్సవముగా యితనిసుందరాకారమంతయూ పరిశీలించెద (ప్రకాశముగ)

కం॥ సవిరళ కంఠస్వరమున
పవడాలను విక్రయించు • భావజ సమర

(అని వల్లువిరచి కౌగలించి ముద్దాడినట్లు అభినయించి)

కం॥ బట్టవి సరస స్థితిలో నెరిగ్
విపరింపగరా ని భ్రాంతి • వెలసెను నాకు॥

(అని హస్తమెత్తి సైగసేయును)

చిక్క—(తిరిగిచూచితనలో) యీమెగారునన్నుబిలచుటలో భావాం
తరము గనుపట్టుచున్నయది. (తలపంకించి) అయిననూ సంశయ
రహితుండనగు నాకేటికివిచారము. (అని వచ్చియెదురుగానిలచును)

లలి—అబ్బీ యటునిలచెదవేల లోపలరమ్ము (అని లోపలకేగును)

చిక్క—(వెంటనే లోపలకుబోవును)

లలి—(యోక కింబళిబరచి) అబ్బీ దీనిపై కూర్చుండుము

చిక్క—(అట్లేకూర్చుండును)

లలి—(యెదురుగా నిలచి)

గీ॥ సరస సంగీత సాహిత్య • సౌకుమార్య
విధుల నేర్పరివంచును • వింతెంగ
కలసి మెలసియు మాట్లాడి • కాంక్షదీర
పవడపు సరాల గొనుమూహ • బడితిమాపు॥

చిక్క— (కొంచెము నిదానించి) తల్లీ మగ్గప్రసంగమేటికి పవడాలసరము
జూపెదవా.

లలి— (కొంచెము కోపముతో) అబ్బీ నేనేమిమగ్గప్రసంగము జేసితిని
పవడాల సరములుగాక యింకేమిచూపెదవో త్వరగాచూపుము.

చిక్క—(వెనుకపడి తనలో) అయ్యో నేనెంత త్వరపడితిని అనుమాన
రహితుండైన నా మనమున కిట్లనుమానము మొనగూడనేల యిదియం
తయూ పరమేశ్వర విలాసంబుగానున్నయది (యూరకుండును)

లలి— (కొంచెమునవ్వుతూ) అబ్బీ యూరకుండెదవేల యిందు భయప
డనవసరముండదు నీయిష్టమైనప్రసంగము జేయుము కానీ నీపేరేమి.

చిక్క—తల్లీ నా పేరు నిజలింగచిక్కయ్య నీకు కావలశిన సరముల తీసు

కొని నను పంపుము. యివియన్నియూ యీగ్రామంబున తిరిగితెమ్మనగొనవలశిన కనియున్నయది యింత ఆలస్యమేల చేసెదవు.

లలి—అబ్బే యిందు నా ఆలస్యమేమున్నయది నీయిష్టమైన వేవియో చూపుము. మారాడక కొనియెద.

చిక్క—(సంచివిప్పి రెండు సరములనిచ్చును)

లలి—(సంతోషముతో అందుకొని) ఆహా యీపవడము లెంత రమ్యముగానున్నయవి. అబ్బే పీటి ప్రాశస్త్యము దెలుపు పద్యమొకటి మనోహారముగా చదువుచుంటివే అది చదువుము కర్ణానందముగా వినియెద

చిక్క—తల్లీ అట్లే చదివెద.

సీ॥ ఆధార చక్రాంగ • నాలింగ నీపన
    శాలు మాతొూకురా • లొలిగొనరె

లలి—ఆహా యెంతిమనోహారముగా చతివితివి యీపదాభిప్రాయమున కుసరిగా కనడాలనే మోతొూకురాలగొన నుంకించుచుంటి చూడుము (అని కౌగిలించుకొనబోవును)

చిక్క—ఆహా బసవేశ్వరా సదాశివా (అని వోకవైపుగా తప్పించుకొని) తల్లీ యిందు యీఅర్థమున్నదా యేమి

లలి—మనోహారా నీకిప్పటి కాధారచక్రాంగనను నేనై నీవునన్ను కౌగలించుకొనుటకు మారు నేనేనిన్ను కౌగలింప నూహించితి యిందేమితప్పుగలదు

చిక్క—తల్లీ ఆఆధారచక్రాంగనవీవుగావు అది ఆలింగనశబ్దముగాకా.

లలి—మనోహారా కారా అవునో కాదో ముందు దెలియపరచెద కానీ నీవు మాటిమాటికి నన్ను తల్లి అమ్మా జననీ అని పిలువనారంభించితివే నీతండ్రిభార్యనాయేమి అట్లుబిలువకు నాపేరులలితాంగి యీపేరుననే పిలువుము యిదిమొదలు సుందరాకారాయని నిన్నుమనోహారముగా బిలచెద యేదీ రెండవచరణము చదువుము.

చిక్క — (తనలో) హాబసవేశ్వరా సదాశివమూర్తీ నేడెంతటి విపత్సు ద్రమున ముంపనుంటివో గదా. (అని కొంచెము నిదానించి) కానిమ్ము యీమెను మదనమోహాబ్ధిని బడనీయక జ్ఞానమార్గంబున నడువబోధించెద (ప్రకాశము) లలితాంగీ చదివెద వినుము.

సీ॥ స్వాధిష్ఠ చక్రాంగ • నాధీనధీపవ
డాలు ముద్రాంకురా • లోలిగొనరె

లలి — మనోహరా నీ యిష్టమైన అంగనను నేనుగాన, నా ఆధీనమైన బుద్ధిని జూపించి నన్ను సంతుష్టిబరుప న్యాయముగాదా.

చిక్క — లలితాంగీ యిదియూ వికటార్థమే

లలి — మనోహరాంగా పోనిమ్ము అట్లేఅనుమ్ము మూడవ చరణము చదువుము

చిక్క — లలితాంగీ అట్లే చదివెద వినుము.

సీ॥ మణిపూరకాంగనా • మలమణిస్ఫూర్తి పవ
డాలు ధ్యానాంకురా • లోలిగొనరె

లలి — మనోహరాంగా నేనెంతపద విభజనగా చెప్పబూనిననూ నాభావమభావ మనుచుంటివి కానిమ్ము నాల్గవ చరణము చదువుము.

చిక్క — లలితాంగీ అట్లే చదివెద.

సీ॥ ఆయనాహతవని • తాధరద్యుతి పవ
డాలు పంచాంకురా • లోలిగొనరె

లలి — మనోహరావతారా యీపదాభిప్రాయమునైనా వచించెద యొప్పకొనుము. ఆ అనాహతవనితను నేనైననూ కాకున్ననూ అధరద్యుతికి మాత్రము నేనౌదును నిజముగా నాఅధరద్యుతికి యీపవడములకాంతి సమానమేమో సమపెట్టి చూచి చెప్పుము, (అని పెదవిచాపి ముద్దుగొనునట్లు నటించును)

చిక్క — లలితాంగీ యిదియేట్సాహసము నీవేసరిపెట్టి చూచుకొనుము

లలి — (నవ్వుచూ) మోహనాకారా నీపేరును నేనెట్లు మార్చి మార్చి

సొగసుగా బిలచుచుంటినో అట్లే నాపేరునూ మార్చిమార్చి సొగసుగా బిలచుచుండుము.

చిక్క—అట్లు మార్చిమార్చి బిలచునంతటి సామర్థ్యము నాకడలేదు.

లలి—మనోహరా నే చెప్పెడి అర్థమంతయూ వ్యర్థము చేయుచుంటివి నేనెందుల కర్థము చెప్పవలయును చిన్న చరణములు నాల్గూ చదువుము.

చిక్క—తల్లీ అట్లె చదివెద నాలింపుము.

లలి—అదిగో తిరుగ తల్లియని పిలువ నారంభించినావె

చిక్క—లేదు లేదు లలితాంగీ

గీ॥ భువి విశుద్ధాంగనా సక్తి • పవనము లివి
పరహితాజ్ఞేయ మోహినీ • పవనములివి
స్థిరసహస్రార సంప్రాప్త్యైక్య • శివుని మూపు
పవనము లివి గొనరిమ్ము • బ్రస్తుతింతు॥

లలి—(తనలో) యీతని సుందరాకారము వీక్షించినది మొదలూ నా మానసం బతిమోహాయత్తమై తిరుగకున్నయది. యితని నెన్నివిధంబుల బాధించిననూ నాయిష్టంబు దీర్చ నూహాపడకున్నవాడు యితని యిష్టానుసారంబుగా కొంతవరకు పోయి వాదించి చిక్కుపరచుకొనెద (ప్రకాశముగా) మనోహరా నీవు నిజముగా శైవమతస్థాపనాభిప్రాయమును చూపించుచుంటివి. ఆశివుని చెర్యలీ వెరుంగుదువే యెరుంగవే కొన్ని చెప్పు దాలింపుము.

మ॥ విడిగానుండిన యెవ్వనిన్ గలయునో • క్షోభించి యేవీనుడే
ర్పడ గొంపోవునో యంచు నెంచి తనశీ • ర్షంబందు భాగీరథిన్
వడిగానిల్పి భవాని కాగ్రహము రా • బాపన్ జటాజూటమం
దడగన్ గంగను డాచి దుర్గకపుడ • ర్ధాంగంబు నర్పింపడే॥

చిక్క—అవునైననేమి అదియంతయూ పరమేశ్వర చిద్విలాసము.

లలి—అటులైన నీ దేవుని చిద్విలాసము నాయెడజూపి మన్మనోహర విలాసుండవుగారాదా.

చిక్క — అట్లైట్లు అదిజేసిన యింకొకటి జేయవలదా.

లలి — (నవ్వుచూ) మనోహారాపత్రిచారా అదియేది.

చిక్క — లలితాంగీ చెప్పెదవినుము

మ॥ సురలు బ్రాతుసు లేకనై యమృతము • స్తోకస్థితిన్ గైకొనన్
శరధిన్దర్వగ నందు లోకముల నా • శంబూను వహ్నిచ్చటల్
బరువన్నెన్విష మాద్భవిల్ల గని యో • పాలాక్ష రక్షింపు మ
న్నారశేయ న్గరళంబుమ్రింగి విపదం • భోరాశివారింపడే॥

ముందు యీపనిశేయు సామర్థ్యముండిన గాని నీవన్నపని శేయుటకు వీలుండదు.

లలి — (చిరునవ్వుతో) నీచేతనయినపని చేయుమంటినిగాని చేతగానిపని చేయుమంటినా యిదివినుము.

ఉ॥ కల్లలనాడుమాత్రమున • కాముహరుండని నిన్ను నెన్నగా
నెల్లరతెంచు మాత్రమటు • లబ్బిన మోహము నాపలేక తా
భిల్లి నరణ్యమందు గని • బ్రీతి దగుల్కొన లేదె నాడు న
న్నెల్ల నటంచు బల్కు పురు • షోచిత వృత్తియె ధర్మకర్మమె॥

చిక్క — పురుషోచిత వృత్తియో కాపురుషోచిత వృత్తియో ధర్మకర్మమో యధర్మకర్మమో నీవెరుంగుదువు గాని నేనె మెరుంగుదును మోహమాపలేక యీశ్వరుడు భిల్లిని అరణ్యమందు దగుల్కొనినాడని వక్కాణింపు చుంటివే నిక్కమేనా నీవెఱింగిన సంగతియేనా పాపమీ బోధ నెవగునేర్పె నేర్చితివి

చం॥ గిరిజకు క్రీడివెన్నునను • గిల్కొనుమచ్చను జూప భిల్లుడై
గిరిజయు నట్టిరూపమున • కేరుచు వెంటనె రానొనర్చి తా
నరు నెదిరించి సూకరము • నాది యటంచని గృద్దులాడు చా
పరుపిడనాడి క్రిందబడి • పాశుపతాస్త్ర మొసంగె క్రీడికిన్॥

అందువలన భిల్లిరూపిణియగు పార్వతితో చరించెను. గాని నీవన్నట్లు యితర కాంతతో విహరింపలేదు.

లలి— (నవ్వుచూ) మనోహరా అటులనా నేనేమెఱుంగుదు. పోనిమ్ము యీదేవుడే యింకొక్క పనిచేసె నాలింపుము.

మ॥ యతిరూపంబు ధరించి కామియగుచు ♦ న్వ్యాభక్తి భక్త్యాంగనా
పతినిర్జ్జరి మదీయశీలమిది యే ♦ పద్మాక్షినో దెచ్చి నా
జత గూర్చన్నభజియింతు లేమిని భుజిం ♦ చన్జూచు మంచార్యభూ
పతిభీతిన్గన భార్యమన్ననుచు భా ♦ వంబందునన్గా మెచ్చెదే॥

దీనికేమి సమాధాన మిచ్చెదవు

చిక్క— దీనికే సమాధాన మివ్వజాలనా

శా॥ అభక్తులను దానశీలురెవరే ♦ దర్థించునో యద్దిని
ర్లోభస్వాంతత నిత్తునన్న మునినై ♦ రూఢిన్పరీక్షించి తా
నాభక్తాగ్రణి నేలెగాని కుటిలాం ♦ తస్స్వాభవుడై గ్రాల డ
మ్మాభర్గుండభవుండచంచలుడు సు ♦ మ్మావాని నిందింతురే॥

లలి— (కొంచెము కోపముతో) ఓహో యేమది నీవే యతినిభక్తుండవా నేనుగానా యేమి ఆయీశ్వరుడచంచలుడభవుండనుచుంటివే అతడేనా అట్టివాడు నీవుగూడానా,

చిక్క— అవును నేనట్టివాడనైననూ కాకున్ననూ నీకేమి యవుసరము. నాపనడములు నాకిచ్చి పంపివేయుము.

లలి— మనోహరా యెందుకింతటి యాగ్రహ మూనెదవు అయిననూ రుద్రశిష్యుండవగు నీకిట్టి తామసముండుట యొకవింతగాదు. ఇదివినుము.

ఉ॥ ఈమనుజాళి కీసుమద ♦ శేంద్రియము ల్సమకూర్చె వీటిశ్వే
చ్ఛా మహితత్వమున్దెలసి ♦ సంభ్రమమందగ నీవెఱుంగ వి
స్సీ మరుగేను చెల్పితిమ ♦ దీప్సితమూనుము సంశయింప కీ
కామియుగాక మోక్షపథ ♦ గామియుగాదు ధరిత్రి నెవ్వఁడున్॥

చిక్క— ఓహో యెంతటివిజ్ఞానివి యిదియా నీబోధార్థము చాలుచాలు విరమింపుము యిట్టిబోధ లేరికినీ చేయబూనకుము.

ఉ॥ ఈమనుజాకృతిన్ బుధ • శేంద్రియముల్ సమకూర్చి వాటికే
చ్ఛామహితత్వమున్ దెలిసి • సంతసమందగ నా నెఱుంగు దిం
దేమఱుగున్న తెల్య భవ • దీప్పితమూను తలంపు మానుని
ష్కామియుగాక మోక్షపథ • గామియుగాదు ధరిత్రి నెవ్వడున్॥

లలి— (నవ్వుచూ) యేమీ నీవు నిష్కామవచో విలాసుండవా.

చిక్క—అవును మాటలయందే కాదు. క్రియలయందూ అట్టివాడనే.

లలి— అయిననేమిగాని నీకు భార్యగలదా లేదా

చిక్క— వున్నది

లలి— ఆమెనిట్లె వేధించుచుందువా

చిక్క— లేదు లేదు నిన్నుమాత్రము వేధించుచుంటినా.

లలి— నన్ను వేధించుచుంటివో లేదో నీయాత్మ కెరుక లేకున్నదా కా
నిమ్ము నీభార్యతో నెట్లు చరింపుచుంటివి.

చిక్క—అగ్నిసాక్షిగా పెండ్లియాడిన మాటచే ధర్మ నిబద్ధుండనైతి.

లలి—అగ్నిసాక్షిగా నీవు ఆమెను వరించితే ఆత్మసాక్షిగా నిన్నేనువరిం
చితి యిట్టి నావలని సౌఖ్యంబెంతయో నీయాత్మ నెరుంగుము.

చిక్క—నీవలన యెంత సౌఖ్యం భావహిల్లనున్ననూ నాయాత్మ యిట్టి
తుచ్ఛసుఖంబుల నాసించునది కాదు.

లలి— అటులనా నిన్ను మంచి బ్రహ్మజ్ఞానివని చెప్పుకోవలశిన వాడవె
కాకున్న మమాత్మా సర్వభూతాత్మాయను న్యాయ మేగంగిలోనో
గల్పి మాటిమాటికి నీయాత్మ నాయాత్మ యనివేరుగా భాషింపు
చుందువా మొదలు ఆత్మతత్వమెట్టిదో నీకు తెలియునా.

చిక్క—అవును నాకాత్మతత్వమెఱుంగునంతటి సామర్థ్యమున్నదా.

లలి— అవును లేనిమాటయే యదార్థము. అట్టి సామర్థ్యమేయున్న య
డల అశాశ్వితంబైన ప్రకృతిరూప భేదంబుల దృష్టినిల్పి అట్టిదియే
ఆత్మస్వరూపమని భావింపుచూ రజ్జుసర్పభ్రాంతియనియెఱుంగ నేరక
అభిద్వైకస్వరూపంబగు మదాత్మానుసంధానాత్ముండవు గాక వ్యతి

రేకాత్ముండ వెంచుకొనుచు. (అని తనలో) యితండీ యింటిలో నెవ రైనా యుండిరని పరులెవరైనా వత్తురని సంకోశింపుచుండెనా యే మి ఆవిషయము తేటపరచి చూచెద. (అని ప్రకాశముగా) ఓసి ముగ్ధ యీవిషయ మొక్కటాలింపుము.

మ॥ ఎవరిచ్చోటికి రారు భీతిఁబడఁబో • కీ వెంతయుఁ నీకు యీ
వవడాలమ్మెడి వృత్తిమానగ భవ • ద్వాంఛార్థ మర్పింతు న
వ్యావయస్కఁ లలితాంగి పేరుగల • దివ్యాకార నగ్రాస్వయఁ
పవర్తింపన్నగు పానుపల్లదిగొ ని • న్వాంఛించితిఁ రమ్ము రా॥

(7 అనుబంధము)

(అని చెయ్యిబట్టుకొనును)

చిక్క— (చెయ్యి వదలించుకొని) ఆహా సాహసురాలా యెంతపనికివ చ్చితివి (అనియిడాపింగళ పరీక్షించి తనలో) హా బసవేశ్వరా సదా శివమూర్తి యిఖయెంతటి ఆపదరానున్నదో గదా. యెట్టియాపదవ చ్చినను తలబోయినను నాకీ నిశ్చలబుద్ధివరకు మార్చ బోకుము. (అని లలితాంగినిచూచి (ప్రకాశముగా) అమ్మా స్త్రీలకిట్టిసాహస ముంచుట ధర్మవిరుద్ధముగాదా.

లలి— వెర్రివాడ అధర్మవిరుద్ధంబైన మదీయకృత్యంబు ధర్మవిరుద్ధంబగు సాహసోగ్రంబుగా గనుపట్టుచున్నదా.

మ॥ మనపూర్వార్జితకర్మభాగ్యమున సా • మాన్యంబె యోచింపయ
వ్వనసౌందర్య విలాసతుల్యులము కై • వజ్ఞాన సందోహచిం
తనచాతుర్యల మిష్టకేళి జరియిం • తామన్న యేకాంతమి
ట్లనుకూలంబయె నన్నుగూడుమల బ్ర • హ్మానందమార్గాపగాఁ॥

(అని కౌగలించుకొనును)

చిక్క—(తొలగనెట్టి రౌద్రముగా) ఛీ దురాత్మురాలా అవలుండుము పైకిరాకుము. యేమనుచుంటివి యీతుచ్ఛసుఖంబునకాసించినిన్ను గూడినంతమాత్రమున నాకు శుద్ధ నిర్గుణ బ్రహ్మానంద మార్జించు

నంతటి సామర్థ్యముగల్గునా (ఆనందో బ్రహ్మేయని) శ్రుతిస్మృతులు
వాకొనుచున్న వందువేమి యేవిషయానందము బ్రహ్మానందము.
కాదని వాకొనుచున్నవో యెరుంగజాలక నాకీబోధ జేయ నారంభిం
చితివా చాలు చాలు నీయప్రశస్త ప్రశంసలు చాలించి నాపవడ
ముల నాకిప్పు శీఘ్రముగా పోవలయును

(8 అనుబంధము)

లలి — (వెలవెలబోవుచు తనలో) యీతెండిక నాయిష్టంబు దీర్చుటకల్ల
ముందుగా యితనిని నేను వాంఛించి యెంతటి యవమాన మందితిని
యీవిషయ మితరు లెవరయిన వినిరేని నా పరువుబోనదా (నిదా
నించి) యితరులకీ రహస్యమెట్లు తెలియును దెలియ కేమి యితండు
జెప్పడా అందువలననే యితరులకు చెప్పకుండునట్లు ముందుగా యి
తనివల్ల ప్రమాణ వచనము తీసుకొనెదగాక (అని ప్రకాశముగా)
మనోహరా,

మ॥ జనునే కాంతకు ముందుపూరుషుని వాం • ఛన్గోరనుంకించుటె
మననేమున్నది సాదృశంబిదియె నీ • మాటిక్క ప్రవర్తించి కో
రిననారీమణి సంగశాస్త్రముల బా • రిన్బోయితేగాక నిం
దనుకీర్ణంబున మోహజా చెదరు గా • దా పూరుషుల్భ్యాస్థలిన్॥

చిక్క — (ధ్యాన మభినయించి)

మ॥ అలచిత్రాంగి చరిత్రమున్దెలుపక • త్యంతార్తి నిన్గాంచు ని
శ్చల సారంగధరావరోన్నతిని శీ • ర్షంబూడిసన్ హృన్మహా
త్సల సారంగధరున్భజింపుచు భవ • ద్వ్యాస్థత్వమున్దెల్ప ను
త్తలపాటేటికి నన్నుబంపుముకనో • తల్లీ నమస్కారముల్॥

(అని నమస్కరించి సంచితీసుకొని పోబోవును)

లలి — (సంచిపట్టుకొని దుఃఖముతో) నాథా నన్ను మన్మథాగ్నికి వప్ప
జెప్పి పోవుచుంటివా యిందువలన నేను జచ్చిన నీకు స్త్రీహత్యా
దోష మాపాదించదా. (9 అనుబంధము.)

చిక్క— అమ్మా ఆడిగెలు నీకెందులకు నాతో త్రివసేవఃబోవు చంటిసి (అని సంచివదలి ద్వారమావలకుబోవును)

(10 అనుబంధము)

లలి— (తలకంకించి) దురాత్మా యెంతవరకే గెదవురే (అని లోపలకేగి తనమెడలోని బంగారపు లింగకాయ గొలుసూ తాను తీసుకున్న కవడాల సరములు సంచిలోవేసి) దుష్టా నాకామ్యుడవైన నీవేసో వుచండ యాపవడముల సంచి నాకెందులకు గొనిపొమ్ము (అనిద్వారమావల వేయును)

చిక్క — (ఆసంచి కందుకొని తనలో) హా బసవేశ్వరా పరమేశ్వరా సదాశివమూర్తి యిదయుంటెయూ తమ చిద్విలాసమె నన్నురక్షింపుము రక్షింపుము. (అనిపోవును)

(11 అనుబంధము)

లలి— (యేడ్చుచూ) అయ్యయ్యో భటులారా! యింట నొంటరిగానున్న నన్ను చెరబట్టి చెయ్యరాని చేష్టలాచరించి నేనల్లరికి లేవగా యితరులొత్తురేమోయను భయంబున కాలికి బుద్ధిచెప్పు చున్నవాడు. పట్టుకొనుడు పట్టుకొనుడు (అనిఅరచును)

(యిద్దరుభటులు ప్రవేశించి) అమ్మా యేడి యేడీ ఆనిలచినవాడేన (అని చిక్కని పట్టుకొందురు) (తెరబడును)

చతుర్థాంకము.

సమాప్తము.

---



శ్రీరస్తు.

# నిజలింగ చిక్కయ్య

## పంచమాంకము.

{ రాజకోర్టు కామమోహనుడు సునందుడు వకీలు కూర్చొనియుందురు సేవకుడు నిలబడియుండును తెర లేచును. }

చిక్క—(సంచితో ఖిన్నుడై బోనెక్కియుండును)

లలి—(యొకవైపు నిలబడియుండును)

కామ—(తనలో) ఛీ యీరాజకీయ వ్యవహారంబులు మితిమీరుచున్న యవి నామానసం బాత్మపత్నీ వియోగాంబుధి నోలలాడుచూ యేమియూ తోచక ఖిన్నుడనగు నేనీ వ్యవహారంబులగల నిజానిజంబు లారసి ధర్మానుగుణ్యంబుగా నెట్లు శిక్షింపగలుగుదును (నిదానించి) కానిమ్ము విచారింపకుందునా (తలపంకించి) విచారింపకుండుటెట్లు జనపరిపాలకుండనగు నేనేవిచారించి దుష్టుల శిక్షింపకుండిన దుఃఖార్తులకు దిక్కెవరు (అని ప్రకాశముగా) మంత్రిశేఖరా ముందు ఆమె వలన ప్రమాణవాఙ్మూలము తీసుకొని విచారింపుము.

సునం—ప్రభువరా చిత్తము. (అని సేవకునిచూచి) సేవకా ఆమెవలన ప్రమాణవాఙ్మూలము తీసుకొనుము.

సేవ—చిత్తము (అని ఆమెనుచూచి) అమ్మా దేవునియెదుట ప్రమాణముచేసి అబద్ధముచెప్పను నిజమే చెప్పగలదాన ననుము.

లలి—దేవునియెదుట ప్రమాణముచేసి అబద్ధముచెప్పను నిజమే చెప్పగలదానను.

వకీల్—(వాఙ్మూలము వ్రాయుచుండును)

సునం— (వాఙ్మూలము వ్రాయ నారంభించి) అమ్మా నీపేరేమి

లలి— లలితాంగి

సునం— నీకులం

లలి— లింగధారులము

సునం— నీనివాసగ్రామము

లలి— కళ్యాణపురము

సునం— యేమిజరిగినది

లలి— అయ్యా యీదినము షుమారు యేడుఘడియల ప్రొద్దెక్కిన తరు వాత మాయింటిలో యొంటరిగానున్న నన్ను యితండు దుర్భాష లాడి బలాత్కారముగా చేయరానిపనుల కుపక్రమింపగా నేను సమ్మ తింపక ఆగ్రహించి కేకవేయ చుట్టుపట్టువార లొత్తురని భయపడి పరుగిడుచుండెను అంత సిపాయీలు కేకలస్విని వచ్చి వీని నడ్డగించి పట్టుకొని తమసన్నిధికి దెచ్చిరి న్యాయముగా తమరీతనిని విచారించి తగురీతి శిక్షింపవేడుకొనుచున్న దానను దివ్యచిత్తమునకు దేవలెను.

సునం— (లేచి వ్రాసినకాగితము రాజుగారికిచ్చును.

కామ— (అందుకొని) అమ్మా యీవ్రాయబడినదంతయూ వాస్తవమేనా

లలి— చిత్తము వాస్తవమే.

కామ— సచివవరా ఆతనినీ విచారింపుము.

సునం— ప్రభువరా చిత్తము (అని సేవకునిచూచి) సేవకా వానిని గూడా ప్రమాణము చేయించుము.

సేవ— అయ్యా చిత్తము (అని చిక్కయనుచూచి) అయ్యా దేవునియ దుటప్రమాణముచేసి అబద్ధము చెప్పను నిజమే చెప్పగలవాడననుము

చిక్క— దేవుని యెదుట ప్రమాణముచేసి అబద్ధము చెప్పను. నిజమే చెప్పగలవాడను.

సునం— అయ్యా నీకులమెయ్యది

చిక్క— క్షత్రియకులము

సునం — మీ గ్రామ నామ మేమి

చిక్క — నాగపురము

సునం — తమకు జీవనాధారంబగు వృత్తి యేది

చిక్క — కవడాలవ్యాపారము

సునం — మీ నామధేయమేమి

చిక్క — నిజలింగ చిక్కయ్య

సునం — మీకు తలిదండ్రు లుండిరా

చిక్క — తండ్రి లేడు తల్లిగారున్నయది.

సునం — నీకు వివాహమున్నదా

చిక్క — అయినది

సునం — సంతానమున్నదా

చిక్క — లేదు

సునం — నీవీ గ్రామమునకువచ్చి యెన్నిరోజులయినది

చిక్క — నిన్నటి వుదయమే వచ్చితిని

సునం — యీవుదయ మీ మెగాడింటికి పోయితివట నిజమేనా

చిక్క — నిజమె

సునం — నీయంతనే నీవుపోయితివా యెవరైనా పిలువ పోయితివా

చిక్క — ఆమె పిలువ పోయితిని

సునం — ఆమె యెందులకు పిలచినది

చిక్క — కవడములు గొనుటకు

సునం — నీవింటిలోనికి పోవునప్పటికి యితరులెవరైనా నుండిరా

చిక్క — తెలియదు

సునం — అంత నేమిజరిగినది

చిక్క — భగవద్విలాసము.

సునం — యేమిజరిగినదో చెప్పమన భగవద్విలాసమనియెద వేమి.

చిక్క — అయ్యా అంతకుమినహా మరేదియూ జరుగలేదు.

సుం- యితర మేదియూ నెరుగవా

చిక్క- చిత్త మితర మేదియూ నెరుగను.

సున- (తనలో) యీతని ముఖవర్చస్సునూ కంఠధ్వనినీ కనపెట్ట కామ మోహాన కుముదవల్లుల బోలియున్నయవి యీతె దెవడై యుండునో ప్ర (తలపంకించి) యెవ్వడైననూ నేమి యీతెందు నిజముగా శివలిత్వ వేదిగా గనుపట్టు చున్నవాడు. (అని తనచే వ్రాయబడిన కాగితము రాజుగారికిచ్చును)

రాజు- (అందుకొనితన నలో) యీతనిని గాంచినది మొదలూ నాకేది యో యొకవిధమైన మోహమూరు చున్నయది. కారణమేమై యుండవచ్చును (కొంచెము నిదానించి) యీతని గళాదాములు యీతని ముఖకళావిశేషంబులు కనిపెట్ట కుముదవల్లినన్నూ బోలితాం డనమాను చున్నయవి యితెడా కుముదవల్లికి సంతానఫలంబు వలన జనించినవాడా యేమి (కొంచెమూగి) అట్లైన యితనికీ పదడముల నమ్ముకొనునట్టి స్వల్పదశ యేల ప్రాప్తించును యొకవేళ ప్రాప్తించిన నూ యీపురంబున కేలవచ్చును వచ్చిననూ శివవరప్రసాద ఫలజని తునకీ దుర్గుణముండునా యుండదు. యీలోకంబున యొకరినొకరు బోలియుండుట సహజమేకదా యేటికీ పిచ్చిభ్రాంతి (అని ప్రకాశ ముగా) నిజలింగ చిక్క యీ నీచే చెప్పబడినదంతయూ వాస్తవమేనా

చిక్క- అయ్యా వాస్తవమే

కాము- (లలితాంగినిచూచి) అమ్మా వీని నేమయినా అడుగ దలంచిన అడుగుము.

లలి- చిత్తము (అనివకీలున కేదియో రహస్యముగా చెప్పినట్లునటించును.

వకీలు- (విని లేచి చిక్కయ్యనుచూచి) నీవు నిన్నటి సాయంకాలము గోదావరీ తీరంబున స్నానమాచరించు చుంటివట నిజమేనా.

చిక్క- అవును

వకీలు- (వ్రాసుకొని) ఆతీరంబునకీప్వాడీవె నీరంబునకై వచ్చెనట చూచితివా
చిక్క— ఆతీరంబున కక్షిదులు వచ్చినమాట వాస్తవమేకాని వారిలో
నీమె యున్నదో లేదో స్నానమాచరించుచుండుటచే పరిశీలించు
నంతటి వ్యవస్థ నాకు చిక్కినదికాదు.
వకీలు— పోనిమ్ము ఆమెనిన్ను చూచినదా.
చిక్క— ఆవిషయ మామెగారికే యెరుక నాకెట్లు దెలియగలదు.
వకీలు— సరే యీమెనీరోజున బలాత్కారముగా చెరుప బూనితివట
నిజమేనా.
చిక్క— (చెవులుమూసుకొని) శివశివా లేదులేదు.
వకీలు— యీమెకు నీకును నేమయినా విరోధమున్నదా.
చిక్క— పరపురవాసుండనగు నాకును యీమెకును విరోధకారణ మేము
న్నయది లేదు.
వకీలు— అట్లయిన యీమెగారీనేరము నీపై మోపు కారణమేమి
చిక్క—— కారణమేమున్నయది పరమేశ్వర విలాసమే
వకీలు— (కూర్చొని వ్రాసుకొనుచుండును)
సునం— (లలితాంగినిచూచి) అమ్మా యీతనిని గోదావరీ తీరంబున
స్నానమాచరింపుచుండగా నీవు చూచితివా
లలి— అయ్యా చూచితిని
సునం— పలుకరించితివా
లలి— లేదు
వకీలు— (లేచి యేదియో అనబోవును)
సునం— యెందుకు లేచెదవు కూర్చుండుము. (అని లలితాంగిని చూచి)
అమ్మా నీమా యింటిలోనికి నిజలింగచిక్కయ్యను నీవే పిలచితివట నిజమేనా
లలి— (ఊరకుండును)
సునం— ఊరకుండెదవేమి చెప్పుము.
లలి— చిత్తము వసనములు గొనుటకు పిలచితిని

సుసం— అప్పుడింటిలో నెవరైనా నుండిరా

వకీలు—(లేచి) ఆవిషయమిదివరకే చెప్పియున్నయది. తిరిగి యాప్రస్తా
వన యెందులకు

సుసం— యెందులకో నిన్నడుగలేదు కూర్చుండుము. (అని లలితాంగిని
చూచి) అమ్మా చెప్పుము

లలి— నేనొక్కర్తెనేయుంటిని యెవ్వరూ లేరు.

సుసం— ఆవిషయము క్రొత్తవాడైన యితడెట్లు గ్రహించెను.

లలి—(ఊరకుండును)

సుసం— ఊరకుండెదవేమి చెప్పుము

లలి— స్వామీ యెట్లు గ్రహించెనో చెప్పజాల

సుసం— మీరిద్దరూ కలహించు సమయమున యిరుగుపొరుగు వారలె
వరైనా వినివచ్చిరా

లలి— మా గేహమతి విశాలావరణముతోనున్నదగుటచే మేమెంతకలహిం
చినను యిరుగుపొరుగువారలకు వినబడనందున యెవ్వరూరాలేదు.

సుసం— అటులనా సరే అతడేమియు నిన్ను బలాత్కరించినట్లు గాని
దూరినట్లుగాని చెప్పగల సాక్షులెవరైనా యుండిరా

లలి— యిందులకు సాక్షులెవరూ లేరుగాని నా కేకలన్నివిని బజారునపారి
పోవుచున్న యితనిని బట్టితెచ్చిన భటులిద్దరు మాత్రముగలరు.

సుసం— యెందుకు బైటనీవు కేకలేయుచుండ వచ్చి వారేమి చూచిరి.
యీసాక్ష్యముతో నేమిప్రయోజనము (అని వకీలువైపుచూచి) నీ
వేమిచెప్పనుంటివో చెప్పుము.

వకీలు—(లేచి) 1. అయ్యా యీవగారు గోదావరీతీరంబున స్నానమా
చరింపుచూ నీరంబునకేగిన యీమెనుచూచి మోహించిన మాట
యే స్పష్టము.

2. లేకున్న నీయుదయమనేక బజారులుండగా యీమెగారున్న బజారు

నకే వచ్చి పిలిచియుంటేము౦డదరనే పదజాలస్యేము నీవుబున కేక వేయు
ట తటస్థించదు.

3. ఆ కేకవిని పదములగొను నూహాలో లోపలికి పిలువగా నేగి ఆయింట నితరులెవరూ లేమిని గనిపెట్టి యొంటిగానున్న యీమెను చెరబట్ట నుంకించిన మాటయే నిజము

4. అట్లుగాకున్న యీమెగా రాగ్రహించి కేకలు వేయుటకుగాని యీతండు సంచి బుజాన వేసుకొని బజారున తత్తరపాటుతో పరుగెత్తుటకు గాని కారణముండదు.

5. అదిగాక యీతండన్ని విషయములూ పట్టికగా వప్పుకొనుచూ నేర మొనర్చిన విషయము వరకూ భగవంతునియందు కర్తృత్వముంచి తప్పించుకొనుటకు మిధ్యాభక్తితో భగవద్విలాసమని సాక్ష్యములేకుండా తానే వప్పుకొను చున్నవాడు గనుక సాక్ష్యమనవసరము యితండు నిజముగా యీ నేర మొనర్చిన మాటయే స్పష్టము స్పష్టము స్పష్టము (అని బల్లగ్గుద్ది కూర్చుండును)

సునం—(లేచి) యీ వకీలు బల్లగుద్ది చెప్పినదంతయూ సర్వబద్ధము.

1. యీ నిజలింగ చిక్కయ గోదావరీతీరంబున స్నానసంధ్యానుష్ఠానుండై నిరంబున కేతెంచిన యీమెగారిని చూచి మోహించిన మాట నిజమైనయెడల వీరలకేదో యొకవిధమైన సంభాషణ జరిగియుండవలయును అట్లు జరిగినట్లు యీమెగారూ చెప్పుకొనుటయూ లేదూ ఆ మెగారిని యీనగారు చూచినట్లైనా వప్పుకొనుటయూ లేదు యిందువలన యీనగారు యీమెగారిని బహుమందిలో చూచెనన్న మాటయే అసత్యము.

2. అమ్ముకొనవచ్చిన బేరగాడు అన్ని బజారులను దిరుగుచూ అందరికీ వినబడునట్లు కేకలు వేయురీతిగానే కేకలు వేసెగాని యీమెయొకతియే విని తనను బిలుచునట్లు రహస్యముగా కేకలు వేయలేదు.

యింమువలన యిదివరలో చూచియే యెరుగని యితండు యీామెను మోహించియే వచ్చినాడని చెప్పుమాటంతయు మున్నే కల్ల.

3. తానెరుగని విశాలాలయమునకు యజమానియగు యీాలలితాంగి పిలువగా నూతనుండును బేరగాడునూ నగు య్యీతండు జని యీా యింట నెవరుండిరో యనియూ యెవరెవరేతెంతురో యనియూ భీతిలేక ముందు యీామెగుణముల గ్రహింపక తన నెందులకు బిల చినదీ తెలియక స్వప్రహదప్పి స్త్రీలు సాహసించునట్లు యీామె యేమంటరియని పురుషుడెయ్యా తుంటరి తనమున కీతడుపక్రమించి నాడన్నమాట సర్వాబద్ధము.

4. యీామె యింటిలో కలహించిననూ కలహింపకున్ననూ బజారు లో పదిమంది వినునట్లు అల్లరిగా నరచుటమాత్రము మర్మగర్భిత ము. యీాతండు బజారున పరుగిడినమాట వీనిని పట్టుకున్న భటుల ను విచారింపవలశియున్నయది.

5. యీాతెండన్ని విషయములనూ వప్పుకొనుచూ నేరవిషయములో పరమేశ్వర కర్తృత్వముంచి పరమేశ్వరవిలాస మనుమాట మాత్రము ద్వ్యర్థిగా నున్నయది. యేది యెట్లున్ననూ యీా నేరమొనర్చినట్లు తగినఋజువు లేనందున నమ్మదగియుండలేదు. యిది కల్పితనేరమని యే నానమ్మకము. (అని సేవకునిచూచి) సేవకా 15_16లో నం బరుగల భటులను బిలచికొనిరమ్ము

సే.— చిత్తము (అని తెరలోనికిపోయి తిరిగి భటులతో ప్రవేశించును

సునం— భటులారా యీానిజలింగి చిక్కయ్యను పరుగిడుచుండగా ప ట్టి తెచ్చితిరా నిలచియుండగా పట్టి తెచ్చితిరా!

భటు— అయ్యాయీామెగారికి బజారులో యిరువదిగజములదూరమున నిలచియుండగా పట్టితెచ్చితిమి

సునం— ప్రభువరాయీావిషయమూ తేలిపోయినది యికవిచారింప న వసరముండదు తమచిత్తము (అనికూర్చుండును)

కామ— (లలితాంగినిచూచి) యేమమ్మా తగినరుజువున్న చూపింపు ము లేకున్న యీతనిమీద నన్యాయముగా నేరముమోపినందులకు గాను నీకు తగినశిక్ష విధింప నవుసరమైయున్నయది యిందుకేమిస మాధానము

లలి— (దుఃఖముతో) భూవరా అన్యాయముగా నితనిపై నేరముల మోపునంతటి సాహసురాలనుగాను అని (తనమెడతడుముకొని) అ య్యో మరచితి మరచితి నేనుకలహించునపుడు నామెడలోని బం గారపులింగకాయ గొలుసూ త్రెంచుకొని పరుగిడినాడు వీనినిపరీ క్షింపుడు యిదియేనాసాక్ష్యము నమ్ముడు.

కామ— అటులనా (అని చిక్కనిజూచి కోపముతో) క్షత్రియకులదూ రా యీమెగారిమెడలోని బంగారులింగకాయను గొలుసును దొం గిలించితివట నిజమేనా

చిక్క— అయ్యా నేనెరుంగను

కామ— భటులారా ఆసంచిని వానిని బరీక్షింపుడు

భటు— చిత్తము (చిక్కయ్యనుచూచి) ఆసంచినిటు దెమ్ము

చిక్క— యిదుగో (అనియిచ్చును)

భటు— (ఆసంచినందుకొని విప్పి అందులో గొలుసుతోనున్న లింగ కాయను రాజుగారికిత్తురు)

కామ— (ఆగ్రహముతో చిక్కనిజూచి) దురితకృత్యా యీబంగారు గొలుసు లింగకాయయు నీదియేనా

చిక్క— చిత్తము నాదికాదు

కామ— యీవస్తువెవరిది

చిక్క— యెవరిదో నాకు తెలియదు

కామ— నీసంచిలో నెందులకున్నయది

చిక్క— పరమేశ్వరవిలాసము

కామ— (ఆగ్రహముతో)

గీ॥ ఉర్వ్యతక్షత్రియాన్వయమునఁ • నుద్భవించి
మాయవేషముదాల్చియీ • మాడ్కిఁ బరుల
వనితల చెరబట్టియుసభ • వారలనుగ
నారపగమేశ్వరవిలాస • మనుచుబలుక
బంపెనానిన్నయీశుష్ఠో • పలువ చెపుమా॥

చిక్క — (చిరునవ్వుతో)

ఉ॥ పొందుగనీచరాచరము • పూనిసృజించి చతుర్ముఖాండమం
దెంచునసంగుసీయక • వసించియతీత తమించి శాశ్వతా
నందమయాత్ముడై నపర •మాత్మవిలాసమటంచు జెప్ప కెం
దెంచున కేరుకర్తలని • యేరివిలాసమటంచు నీశ్వరా॥

కామ — (యించుక ధ్యాన మభినయించి తనలో) అహా ఏమి యీతని యాత్మజ్ఞానచాకచక్యము నిజముగాయీతనిని శివభక్తిపరాయణుం డని భావించుకొనుటకే సందేహముండదు యిట్టిపుణ్యపూరుషుడీ దోష మొనర్చెనని యెన్నకొను టెట్లు (తలపంకించి) యెందుల కెన్న కొనగూడదు.

చ॥ వనజభవాన్వయుండు • శివభక్తుడు ఆగమకల్పకుండన
ద్గుణమహితాగ్నిహోత్రయును • కోటిశివాలయకారకుండు బ్ర
హ్మనుజపియించిసద్వరము • లందుబలాఢ్యుడు రావణుండు రా
మునిసతిచేతబంధుహిత •ముఖ్యులతో చెడడేదురాకృతిన్॥

కావున నీతనికేదియో చెడుకాలమావహిల్లియే యిట్టిదుష్కర్మనాచరించియుండును లేకున్న నిజానిజములేటికి వెల్లడింపక ద్వ్యర్థిగామాటలాడబూనును గానిమ్ము యింకనువాదించి యీతనిని పరిశీలించెదగాక (ప్రకాశముగా) నిజలింగ చిక్కయ్యా యేమినీవే దాంతసిద్ధాంతము ఈవేషము వేయునదియు యీదుశ్శేష్ట లాచరించునదియు ఆయీశ్వరుడేనా

చిక్క — (నవ్వుచూ)

గీ॥ యీజగన్నాట్యరంగమం • దీనరాశి
పాలిపోషణ నాడించు • భవ్యమూర్తి
కపటనాటక సూత్రధా • రి పరమాత్మ
డనక నెవ్వడందును చెప్పు • మవనినాథ!

కామ — అటులనా ఆపరమాత్ముడెంతవాడో చెప్పగలవా

చిక్క — (ధ్యానమభినయించి)

మ॥ అణుమాత్రుండని చెప్పగాదగినవా • డా కాను బ్రహ్మాండమం
తినుతానిండెను యింతనా చెయనియ • న్నన్యాకుయిద్దానిమిం
చును శ్లిష్టించును బ్రేమబెంచునులయిం • చుఁ ఆత్మసాక్షిన్వసిం
చునవాఙ్మానసగోచరుండు పరమే • శుండోధరానాయకా॥

కామ — ఇట్టిఅవాఙ్మానసగోచరుండగు పరమేశు డేరూపుతో నచ్చ
ట నీప్రపంచమందెట్లు నిల్చెనో చెప్పగలవా

చిక్క — (ధ్యానమభినయించి) చెప్పెద

మ॥ వనజాతోద్భవుడై జనార్దనుడునై • ఫాలాక్షుడై విశ్వవా
ర్ధిని శృష్టిస్థితినాశనాధిపతియై • దృగ్మాత్ముడై పూర్ణబో
ధనవాఙ్మానసగోచరుండచలనా • త్మాకారుడై సాక్షిమా
త్రనవర్తించునతీతతఁ శ్రితజనా • ధారుండునై భూవరా!

కామ — (కొంచముచింతించి) అట్టిఅవాఙ్మానసగోచరుండగు పరమా
త్మునికీ కర్మలెట్లు దాపురించుచుండును

చిక్క॥ గీ॥ వలదునీపొందువలదంచు • వాదులాడ
వన్నెచీరెధరించియే • వత్తునెడి
కాంతలను బోలికర్మముల్ • గలుచుచుండు
జనులనధ్ధతిఁ జెల్వమా • త్మాధినాథ

కామ — (విచారముతోనుండును)

లలి — (చిత్రరబోవుచు తనలో) అయ్యో యితండు నాగుట్టెల్ల కట్టుమీరి
రట్టుచేయు బూనునా యేమి కాదుకాదు. మాటసామెతగా నిట్లనెను

గాని సత్యశీలుండును ఆత్మవేదియూనగు నీ మహా మహుండసత్య
మాడ నూహించునా (అని ధైర్యమూనును)

కామ— నిజలింగచిక్క యీ రెండర్థంబులగా భాషించెదవేమి నిజమే వచింపరాదా

చిక్క—అయ్యా యిందులో బాహ్యార్థము మాటసామెతగానున్నయది ఆత్మార్థమువరకు యిందు కనుకూలముగా నున్నయది అందువలన ద్వర్థిగా భావించవలశినదే.

కామ—అయ్యా యింకు ఆత్మార్థమేదియో చెప్పుము.

చిక్క—చిత్తమటులనే నీవాసనయే తనికిరాదని ఆత్మపురుషుండువా దింపుముండ సంకల్పమనే వస్త్రచీరె ధరించి వత్తునని చిత్తకాంత నానావిధ కర్మలనెడి వస్త్ర చిన్నెలతో దారసిల్లి కర్మ కాధారమైన జన్మను గలంచుచుండు వంటిదిగాని వేరుగాదు.

కామ—(తెలుసుకొని) అటులనా కర్మ కాధారము జన్మమైన జన్మకా ధారమేదియై యుండును.

చిక్క—(నవ్వుచు) కర్మయే

కామ—అటులైన యీజన్మ కర్మల రెంటి కాధారమేది.

చిక్క—(నవ్వుచూ) పరమేశ్వర విలాసమే

కామ—ఆవిలాసమున కాధారుడెవడు

చిక్క—పరమేశ్వరుడు

కామ—ఈపరమేశ్వర విలాసమున చరించు జన్మ కర్మల సుఖదుఃఖములా పరమేశ్వరున కంటునా

చిక్క—అంటవు

కామ—యెట్లంటవు

చిక్క—రజ్జువునందుదోచు సర్పవికృతులురజ్జువు నెట్లంటవో యటులనే.

కామ—(తనలో) ఆహా యిట్టి వివేకజ్ఞానికీ దోష మాపాదించుటా పరమేశ్వర విలాసముగాక మరియేదియగు నిట్టి మహాత్ముని దోషియని

భావించి శిక్ష జెప్పుటకు నోరెట్లులాడు పోనీ చెప్పకుండుదమన్న అగ్రాన్వయయూ పరదారయూనైన యూమె మెడలోని లింగకాయయూ గొలుసూ యూనసంచిలో జిక్కి నేరమొనర్చినట్లు సాక్ష్యమిచ్చుచుండ శిక్షింపక యూరాజ్యంబున జారచోరుల కుల్లాసంబుగా నేనపవాదంబు మోయవలదా అయిననూ యిందు నిజానిజంబులు దేలుటకై యెంతో వాదించి చూచితినిగాని నాప్రయత్నమంతయూ వ్యర్థమయ్యె నేనేమి శేయువాడ యిట్లు గద్దించి చూచెద తరువాత వీని ప్రాప్త మెట్లున్నదో (అని ప్రకాశముగా) నిజలింగచిక్కయా యూభోధవిషయమూపి నేరమెట్లుజరిగినదో నిజముచెప్పుము లేకున్న నీకు పరిశిక్ష విధించెదను.

చిక్క—(నవ్వుచూ) చిత్తము. నేనీవిషయములో పరమేశ్వర విలాసమని యథార్థమే చెప్పుచుంటిని పురిశిక్ష యన్ననాకు సంతసమేగాని భయమింతయైనను కలుగదు. ని భయమివాష్నాత్రిమూ జనింపదు.

కామ—పురియన్న భయపడక సంతసించుచుంట్లు.

చిక్క—(సంతోషముతో) అయ్యా చెప్పెదవినుము (అని నిర్వికల్పసమాధి నభినయించి)

శా॥ సందేహాస్పద జన్మ కర్మముల నా • సాంతంబుగాద్రుంచి యిట్లుందన్యానిన మోక్షరాజ్య కలితే • స్వానంద మే బ్రహ్మ మానందో బ్రహ్మయటన్న వేద విధి న • న్నాదెల్యవా యెందు కేగంసున్న ఖము భీతి నీయురికినై • కామోద్ధృతిన్యాభవరా॥

కామ—(ఖిన్నుడై) అయ్యా నీయురి దప్పించుకొనుట కామెపై నిందారోపణ చేయరాదా.

చిక్క—(ఖిన్నుడై)

శా॥ హా నేనీ యురిదప్ప నీమెపయి నిం • దారోపణ జేయ లోకానన్నల్గిన చావుదప్పదదిగా • కట ఆత్మ వత్సర్వ భూ

తానీయున్న వచోవిశేష మొకడా ◆ త్మన్నిశ్చ్యమై యొప్ప యీ
నూనానూనతి లేకిగూర్చగల దెం ◆ దున్జెందునో భూవరా॥

కామ — (సంతోషముతో) అయ్యా ఈనిందానిందలు ఈ నూనావ నూనములు కర్మాకర్మలు ఆత్మకే చెందునా.

చిక్క — కాదుకాదు వాటి కనుకూలంబై యశాశ్వతంబై పరిణమించు యీశరీరమునకే చెందునుగాని ఏకనిర్గుణ శాశ్వత శుద్ధాత్మను జెందజాలవు.

కామ — అట్లనియే యీనేరమాచరించితివా.

చిక్క — శివాశివా (అని చెవులు మూసుకొని) అయ్యా పరమేశ్వరవిలాసము.

కామ — (తనలో) హాహా యెట్లైననూ యీ మహామహుండా గుట్టు బైటబెట్టి తననేరమును దప్పించుకొన నుద్దేశపడువాడుగాడు వీనిభావమేనెట్లు దలంచిననూ లోకులెల్లు దలంపరు పరమేశ్వర విలాసమని తప్పించుకొనుటకీ మొండియెత్తు వేయుచున్నాడని యూహింతురు యెవరికే సమాధానము చెప్పగలవాడను. యిందు నిజానిజంబులా పరమాత్మునకే యెరుక (అని కొంచెము నిదానించి) యీతండు నేరస్థుడైననూ కాకున్ననూ ఆమెవస్తువ యీనసంచిలో దొరుకుట వలన వీరందరూ నేరస్థుడితడని నమ్మియుండిరి యిందువలన పరసంసారఘాతకునకిపు యురిశిక్ష వీనికివిధించెద (అనిధ్యానమభినయించి) హేపరమేశ్వరా యీశ్వరా,

శా॥ దోషంబీతిడొనర్చియున్న నరి ద్రుం ◆ తుకా యీ ప్రపంచంబులో
దోషాద్రేక గజాంకుశంబగుదు కాం ◆ దో యీమహాత్మ్యంబు ని
ర్దోషుండైన మృతుండుగాక నరినెం ◆ తో పెన్మహాత్మ్యంబు సం
తోషాకారత ప్రజ్వరిల్లగచుటే ◆ దో కాంతు నీరెంటిలో॥

(అని నమస్కరించి ప్రకాశముగా) సునందా యీ నేరమునకు మూడవరోజుదయమున తీర్పుజెప్పెద. యీలింగకాయ గొలుసూ యీ

మెదానో కదో అడిగి యిచ్చి తీర్పురోజుదయముననే వచ్చునట్లు చెప్పుము. (అని గొలుసూ లింగకాయా యిచ్చును)

సునం—(అందుకొని లలితాంగినిచూచి) అమ్మా యీవస్తువెవరిది నీది యేనా (అని యివ్వబోవును)

లలి—(అందుకొని) అయ్యా నాదియే

సునం—అమ్మా యెల్లుండి ఉదయమే తీర్పువినుటకు రమ్ము.

లలి—చిత్తము అట్లే (అని నిష్క్రమించును)

కామ—సదినవరా యీవగారిని విడికారాగారమునందుంచి యేమేమికో గునో అవియిచ్చుచూ నాగపురములో యెవరికికబురుశేయుమనునో అడిగి చేయుము.

సునం—చిత్తము. (అనునంతలో తెరబడును)

{ నాగపురము బసవేశ్వరస్వామి మందిరము కొంతమంది
భక్తులతో బసవేశ్వరస్వామి కూర్చొనియుండగా }

కుసు—(ప్రవేశించి దుఃఖముతో) హా బసవేశ్వరా హా పరాత్పరా యింకేమియున్నయది సద్గుణగణగరిష్ఠుండును సిత్యానందమయాత్ముండును భవద్బోధిత పవిత్ర పంచాక్షరీ మంత్ర పఠనుండును సంతానేశ్వర వరప్రసాదితుండును యుష్మత్శిష్యుండును భవదాజ్ఞా బద్ధుండును మదీయపుత్రుండునూ నగు నిజలింగచిక్కయ్యను,

మ॥ అకటా యేమని చెప్పుదాన వినుమ • య్యా రేపు కళ్యాణనా
మక పట్టణంబున తీర్పు జెప్పి విధిధ • ర్మంబుంచు సంసారఘా
తకు శిక్షార్హుఁడీయ నెంచిరట వా • ర్తన్బంపె భూమీధవుం
డికనా గర్భము బిడ్డలయ్యె నిదె తం • డ్రి తండ్రి రక్షింపవే॥

(అని గర్భము గొట్టుకొని బసవేశ్వరు పాదంబులవ్రాలును)

బస—అమ్మా లెమ్ము లెమ్ము దుఃఖింపకుము. (అని లేవదీసి యిడాపింగళ పరీక్షించి రౌద్రముగా)

మ॥ పరతత్త్వజ్ఞ ప్రణవాది పూరితమహా । పంచాక్షరీధ్యాన త
త్పరుని౯ మోక్ష ఫలానురాగి నురియే । తన్మాత్రముస్స్ఫురించ ది
క్తరివ్రాతనయేని యీశునయనాం । తర్వహ్ని చల్లార దే
అరవిందారియు సూర్యుడు౯ జెకరెంబి బ్రహ్మాండంబు ఘూర్ణిల్ల దే॥

(అని కొంచెము ధ్యానమభినయించి) యిందునొక మహాత్మ్యంబు జగంబున ప్రజ్వరిల్లనున్నయది యిది మహానందమును జెందవలశిన సమయముగాని దుఃఖింపదగిన సమయముగాదు. (అని భక్తులను జూచి) అయ్యలారా మనము చోటికి కతిశీఘ్రముగా బోవలయును మీరూమీరూ గండగత్తెరలతో బయలుదేరుడు.

భక్తులు — అయ్యా చిత్తము చిత్తము (అనునంతలో తెరవాయిను)

( యిక స్తంభము దానికడ బల్లబెట్టియుండును యిద్దరు
భటులూ చిక్కయ్య నిలచియుండగా తెర లేచును. )

చిక్క — నామానసంబున యేవిచారము లేదుగాని (అనిచేతులుజోడించి)

దండకము: — శ్రీమన్మహాదేవ దేవా దయాపూర్ణ భావా భవద్భక్తుడన్నాన నావిన్నపంబిప్పు డాలింపు మీలోకమందా విరూపాక్షు భక్తుండు చిక్కండు జారుండటంచీ యురి౯ జచ్చెనంచు౯ భరింపంగరానట్టి దుష్టాపవాదంబు రానుంటె దాని౯ నివారింప నూహింపు మెట్లైన గౌరీమనోజ్ఞాంబుజార్క సురేంద్రాది సూరి పురారీ నమోశ్శంకరా యీశ్వరా న్నమోన్నమోన్నమో॥

(అని నమస్కరించి) భటులారా రండు రాజాజ్ఞనతిక్రమింప మీకు నర్హంబుగాదు. (అని యురిబల్లపైకూర్చుండి యురి కంఠమునకు సరిగా తగిలించుకొనును)

భటు — (హాశ్చర్యముతో) అయ్యా చావన్నభయంబులేని తమ నిరంకుశ ప్రజ్ఞాభావనిశ్చయమునకు జంకుచుండియూ రాజాజ్ఞగనుక యీ కృత్యమునకు పూనక తప్పదయ్యె తమకోరిక యేదియో సంశయింపక తెలవిండు (అని మ్రొక్కుదురు)

చిక్క — భటులారా!

గీ॥ అరయ కార్తీక సోమ వా । రాంతరమున
దురితదేహాంతకంబైన యీ • యురిబిదగిలి
మాని తానంద మోక్ష సా • మ్రాజ్యపదవి
నందగల్గిన నాకేటి • సందియంబు॥

నాకోరిక పరమేశ్వరవిలాసమే అంతకిశిశిపరము లేదు (అని ప్రాణా
యామ నియతుండై)

చం॥ హరహర పార్వతీరమణ • హాహరమేశ నమశ్శివాయ ఓం
సురవర మౌనిహృత్కమల • శోభన దేవ నమశ్శివాయ ఓం
పురహర శంకరా భుజగ • భూషణసాంబ నమశ్శివాయ ఓం
శరభవ వైర్వభాకర వృ • పాకపినేత్రి నమశ్శివాయఓం ఓం॥

(ప్రాణాయామము బట్టును) (భటులు యురిబల్ల తొక్కుదురు)
(తెరబడును శివపురభక్తులందరూ తెరలో శంఖములు పూరింతురు
మిన్నుముట్ట ప్రణవధ్వని మోగుచుండును)
(కుముదవల్లి బసవేశ్వరస్వామి గౌరియు తెర యీవలకునత్తురు)

గౌరి — (దుఃఖముతో) హానాథాహానాథా యింకేమియున్నయది నీకు
వురిశిక్షయే జరిగినదా నీవు పోయిన నాకెక్కడిలోకము నేనిదే ఆ
వురి దగిలించుకొని మీవెంబనే వచ్చుచుంటిని (అనియురుకబోవును)

బస — (తడాల్న పట్టుకొని) తల్లీ తల్లి యెందుకట్లు వాపోవుచూ పరుగిడ
జూచెదవు నిలువుము ఆశివపుర వాసులైన భక్తులందరూ అటకుపో
వుచూ చెప్పినమాట యదార్థమయిననూ భయపడ నవసరముం
డదు యెందువలనన్న (అని॥సీ॥ పరతత్వ) అనుపద్యము చదువును)

లలి — (లత్తరముతో ప్రవేశించి తనలో) అయ్యోఅయ్యో యింత మహా
నుభావుండవని యింతటి ప్రాణాయామనియామకుండవని యింతటి
ప్రణవపంచాక్షరీ మంత్రసిద్ధి పరుండవని యింతటి ప్రత్యక్ష పరమే

శ్వర విలాసుండవని యింతటి సత్యశీలుండవని యోచింపక త్రి
యక దుర్మోహినై నిన్ను మోహించుటయే గాక గుట్టుబయటబెట్టి
తప్పించుకొనుటకు వీలులేని కట్టుగట్టి నిన్నీ యురిశిక్ష పాలుగావించి
నేమి మూటగట్టుకొన నుంటిని యీ యురిస్తంభము కడనుంచి కంఠ
ముతోపాటు తెగినతల దొరుగక ప్రణవధ్వని మింటనంట జేయుచూ
కుత్తుకకు కొంతయెత్తున నిరాధారముగా రాజసభకేగు మహాత్ముగు
పోత్తము నిన్నుగాంచనయుత్తములు నీవుచెప్పకయే నిర్దోషివని నిన్నె
రుంగకుండునా పూర్వమాకాశవాణి గుట్టుచెప్పగా రాజరాజనరేం
ద్రుడు విని చిత్రాంగిని శిక్షించినట్లే నన్నుమాత్రము శిక్షింపరా
నేనెంక కిరాతకుల చేతులలో చావనలయును నాయంతనేనే యొకభ
క్తుని చేతిలోని గండగత్తెర గైకొని ప్రాణత్యాగ మొనరించుకొనెద
గాక (అని తెరలోనికిబోవును)

{ రాజసభ రాజు, మంత్రి శివపురభక్తులు నిలచియుండగా
నిరాధారమైన శిరస్సు ప్రణవధ్వని సలుపుచూ కుత్తుకకు
కొంతయెత్తునయుండగా చిక్కయ్య మధ్యనిలచును. }

(తెర లేచును)

కుము — (ప్రవేశించి చేతులుజోడించి)

ఉ॥ అక్షయమోక్షదీక్షితుడ • హాభవదీయ వరప్రసాది పం
చాక్షర మంత్రసిద్ధిగల • సాహసవిక్రమ చక్రవర్తి యీ
శిక్షనుగాంచగావలసె • చిత్రమదేమొ మదీయపుత్రుడీ
బిక్ష నొసంగుమయ్య నిను బ్రేమభజించెద నయ్యయీశ్వరా॥

(చిక్కయ్యనుజూచి) అయ్యయ్యో కుమారా తండ్రీతండ్రి యీఘో
రాకారముకనులారజూచి నిలువజాలనునిలువజాల (అనిపడిపోవును)

గౌరి — (దుఃఖముతో వచ్చుచూ) హానాథా హానాథా నీవులేని యీ
లోకంబు నాకేల యిదే తమవెంటవచ్చుచుంటిని ఆగు మాగుము
(అని యొకభక్తుని చేతిలోని గండగత్తెరలాగుకొని వేసుకొనబోవును)

బస—(ప్రవేశించి ఆమెచేతిలోని గండకత్తెర లాగుకొని) అమ్మా గౌరి యింతసాహసమూనెదవేల నిలుపుము యిందువలన చెందవల శిన భయమేమియూలేదు. (అని మ॥ పరతత్వ్యోక్) అను పద్యము చదువును)

గౌరి—తండ్రీతండ్రీ బసవేశ్వరా మరచితిమరచితి (అనిభర్తపై పుజూది చేతులుజోడించి)

మ॥ పతిభక్తి స్థిరబుద్ధియుంతునేని సత్యముక్ • పంచాక్షరీ ధ్యాన ధీ
మతి నేనీయిదిదప్పకాల మొక థ • ర్మన్నాకి నాభర్త సు
స్థత నేగాంచెను నంతదాక రవియుక్ • చంద్రుందుసంచార మే
గతినోపిడి వచింతుగొక్కయున నో• ఖండేందు చూడామణీ।

(అని నమస్కరించి భర్తనుచూచి) హానాధా హానాధా యీఘోరంబు నాకనులార జూచుచూ నిలువజాలను నిలువజాల (అని పడిపోవును)

లలి— (పరుగిడుచూవచ్చి యొకభక్తుని చేతిలోని గండకత్తెర లాగుకొని వేసుకొని పడిపోవును)

బస—(భక్తులనుజూచి) హాభక్తవరులారా।

మ॥ శివపంచాక్షరి మంత్రసిద్ధిపరుడుక్ • శిష్యాగ్రగుండస్మదీ
యవచోబద్ధుడు సాధువర్తనుడు బ్ర• హ్మానందనిత్యుండు మా
నవలోకంబున కీర్తిచెందు నొడల ప్రా • ణాయామ సత్వుండు నే
డవమానంబున శిక్షగుంద మనమే • లానిల్వ ప్రాణంబులక్।

ఆపరాత్పరుండైన యీశ్వరుండేవచ్చి యీమహామహుని రక్షించుగాక రెండురెండు మీమీ గండకత్తెరలనుకంఠంబులనలంకరింపుడు శంఖంబుల పూరింపుడు (అని శంఖారావమొనర్చి గండకత్తెరవేసికొనును)

భక్తులందరూ— బసవేశ్వరా చిత్తముచిత్తము (అని అట్లేచేయుదురు.)

బస—అయ్యలారా మా మనస్సు పరమేశ్వరుని భజించి అన్నిసారులు శంఖములు పూరించి ఆవల అందరమొక్కమారే గండె గతెరలొత్తవలయును)

భక్తులు—చిత్తము బసవేశ్వరా.

బస—హరహర మహాదేవ శంభో శంకరా సదాశివా (అని శంఖము పూరించును) (అందరట్లే చేయుదురు.)

బస—హరహర శంభోశంకరా మహాదేవా (అని శంఖముపూరించును) (అందరట్లే చేయుదురు)

బస—హరహర మహాదేవ శంభోశంకరా సదాశివమూర్తి నమోనమః (అని శంఖముపూరించును) (అందరట్లేచేయుదురు) (తెరలో పళ్ళయధ్వని యొకటి పుట్టను అందరూ చూచుచుందురు) (తెర జిమ్ముకొనిసదాశివయోగి ప్రవేశించి)

అయ్యలారా త్వరపడకుడుత్వరపడకుడు యీమహామహుండొక్క క్షణంబులో స్వస్తుడగుచు మీరంద రిట్లొక్కమ్మడి ఘోరకలిగా ఆత్మహత్యల గావించుకొనిన,

మ॥ శగధు ్రలుంకవె సూర్యచంద్రులల సం • చారంబునున్నారె రే
ధరణీచక్రము దిర్దిరం దిరుగదే • తారల్దర ్రాలవే
హరభక్తప్రజ హత్యపావక శిఖా • కాంబాల గోపాల మీ
పురమున్నాల్పదె దిక్కులున్నడవె హా • భూలోక మల్లాడదే।

(అని చిక్కయ్యవైపు దృష్టినిగిడ్చి ధ్యానమభినయించును)

చిక్క—(క్రమముగా శిరస్సు దిగివచ్చి కంఠమునకంటును)

సదా—(చిక్కయ్యపై చెయ్యివేచి తుడచుచూ) తండ్రీ నీవేగదా యీలోకంబున శివభక్తులకందరకూ యశంబుగూర్చితివి నిన్నుమీరిన భక్తుండీ లోకంబున లేడు స్వస్థతజెందుము.

కామ—(సదాశివయోగి కెదురుగావచ్చి ప్రాంజలియై) యోగివర్యహేపరాత్పరామమ్మురక్షింపవచ్చిన ఈశ్వరుండవుగాని వేరుగావుతండ్రీ.

మ॥ పరతత్త్వార్థ పరుండితంకనుచు నే • భావించియున్ నేఁడకీ
యురిదీయించిన తెల్వి హీనుఁడను దో • షోద్రేక కార్యార్థి పా
మరుఁడన్ క్రూరత రాత్మకుండ • ఖలుఁడన్ మన్నింపగా నేల మ
త్కరవాలంబున నన్ను జంపి జగదో • త్పాతంబు వారింపవే॥

(అని నమస్కరించి ఖడ్గమివ్వబోవును)

సదా—అట్లుగాదు నిదానించి నే చెప్పబోవు విషయ మాలింపుము.

మ॥ ధరణీపాలక జన్మకర్మ ఫలితా • ర్థంబెల్ల నూహింపగా
తరమే కేశవునకైనగాని హరధా • తలకైనగానీ నిరం
తరమేగోయొకి జన్మకర్మముల గా • థల్ వ్రాసి కష్టింపుచుం
డరె వారల్ పరులెల్ల కర్మలను రా • ఘాయూఢి నిర్జింపగన్॥

భూవరా యొక వేళ

మ॥ ఇది సృష్టించిన బ్రహ్మకే తెలియదా • యీజన్మ కర్మాంశమే
మదియంచీవెఱు రాఘదేవు వినుమా • యంశంబు జీవించుగా
క్పదియాకేమ లటంచు బ్రహ్మఘను మా • ర్కండేయు నిర్నార్చితా
గదియ వ్రాసిన వానితా మార్చుకొనడే • గంగాధరోగ్రాహతిన్॥

(చిక్కయ్యను చూపుచూ) భూవరా

మ॥ జటివైయియాతడు నిష్ఠతోడనుమహా • తుర్లకు పంచాక్షరిన్
పటుభావంబున ధ్యానమున్నలిపి శు • భ్రిత్వంబు నున్గాంచితా
నిటలేక్షణిని జచ్చునంచు విధితా • యిన్ వ్రాయు యావ్రాతనున్
మటుమాయంబొనరించె మంత్రమహిమన్ • మాబోటులోపాయనన్॥

భూపాలా నేనెవఁడనని యూహింపుచుంటివో నీవలనాఁడు సంతానా
ర్థమై చింతింపుచుండగా వచ్చి సంతానేశ్వర వనంబున తపంబాచ
రింప నిన్ను నియోగించి తదనంతరమూ సంతాన చూతఫలంబొసం
గిన సదాశివయోగిని యీమహానుభావుండైన నిజలింగచిక్కయ్య
ఆసంతాన ఫలంబున నీభార్యయైన కుముదవల్లికి జనియించినవాడు
యితండు నిర్దోషి యిట్లాకాశవాణిని బలికించుమన్న బలికించెద.

ఆలింపుము (అని ఆకాశము వైపు దృష్టినిల్పి ధ్యానమభినయించును)
(అందరట్లే చూచుచుందురు)

ఆకా—(ప్రియధ్వని యొకటిగావించి) భూపాలావతంసా

మ॥ అలసారంగి ధరుస్వరించి పసు చి • (త్రాంగీ ప్రియత్నంబు లో
ధల నెన్నో వెలయించి సార్థకత జెం • దన్నాల కీగుట్టులో
కులకున్జప్పని వానిజేసివిడి నీ • కున్జెప్ప నేరంబులన్
గలిపించెన్ లలితాంగి పీనిపయి • నుగ్రంబైన కోపంబునన్॥

యిది యదార్థము. యీమహానుభావ్రంపు సంతానఫలంబుచే ప్ర
ణవ పంచాక్షరి మంత్రపఠన మహత్యంబుచే పవిత్రమైన కుముద
వల్లికి జనియించినవాడు భవత్పుత్రుంపు యిదిసత్యము యిదిసత్యము
(అని పుష్పవర్షము గురిపించును)

కుము— (లేచును)

గౌరి—(లేచును)

చిక్క—(లలితాంగికడకుపోయిఆమెకుత్తుకకు ఆమెతలసరి జేపిఅంజలియై)

మ॥ స్థిరబుద్ధిన్జపియించి నీమపరి శు • ద్ధిన్గాంచి సంతోష సా
గరమధ్యంబున నోలలాడ శివభ • క్తశ్రేణి కెంతోమహా
త్మ్యరమన్జూపితినేని మామకహితాం • బాతల్లి పంచాక్షరీ
గిరిమన్ యీలలితాంగినిప్డు బ్రతుకం • గాజేసి చూపింపవే॥

(అని హస్తస్పర్శన మాచరించును పుష్పవర్షము గురియును)

లలి—(హాయని పొర్లిలేచి చిక్కనిజూచి ప్రాంజలియై)

శా॥ నానిర్బంధన కోడి సంచిపడి య • న్నాపోవ నీసంచిలో
నేనాగొల్పును లింగకాయనిడి ని • న్నీశిశుకున్నాలు గా
నేనే జేసితి దుష్టబుద్ధి నటుపై • యీగుట్టుబైలౌనటం
చేనేజచ్చితి నన్ను లేపుటలు తం • డ్రీమేలె ఖండింపవే॥

(అని పాదంబులబ్రాలును)

చిక్క — అమ్మా లెమ్ములెమ్ము (అని లేవదీసి) తల్లీ నాగురుండగు బసవే శ్వరుండున్న యీ మహాసభలో,

మ॥ అనుమానింపక సత్యమున్నలికి ది • వ్యస్వాంతవై తీర్పు చే
సిన పాపంబును జెప్పబోవునను నవ్వ • స్త్రీన్బట్టి మీదాసురా
లను నాతప్పుల నైచుమయ్య కదివే • ల్దండంబుల్ప్రొంతు నం
చనిపాదంబుల వ్రాలు మా బసవదే • వార్యుండె నిన్నోర్చె చెడుగా॥

లలి — (బసవేశ్వరునిజూచి ప్రాంజలియై) హా బసవేశ్వర స్వామీ తెలిసి యో తెలియకనో నేనొనర్చిన పాపంబంతయూ కరిహరించి మీ దాసురాలనుగా నన్ను భావించి రక్షింప వేడుకొనుచున్న దానను. (అని పాదంబులవ్రాలును)

బస — (లేవదీసి) అమ్మా లెమ్ములెమ్ము మావలన రక్షింపబడితివి.

కామ — (తనకిరీటము నిజలింగచిక్కయ్య శిరమ్మున బెట్టిసంతోషముతో) ఆహా తనయా సర్వలోక విజయంబుగా ప్రణవ పంచాక్షరీ మంత్ర మహిమధ్వజంబు బ్రహ్మాండమధ్యంబున నాటిన నీకు చతుస్సము ద్ర మధ్యావనీతలంబెల్ల ధర్మస్థితిగా పాలింపదగిన కర్తృత్వమున్న యదిగానీ అజ్ఞానానంద బంధురుండనగు నాకేటి కర్తృత్వము (అని సింహాసనముపై గూర్చుండబెట్టును)

సదా — ప్రభువరా ప్రణవపంచాక్షరీ మంత్రధ్యానౌషధము చే పాప వ్రణ రహితయై దివ్య తేజంబున ప్రకాశించు భవద్మహిళాలలామ కుముదవల్లి యీమెయె (అని చూపును)

కామ — (చూచి హాశ్చర్యముతో) తాపసవర్యా దివ్య తేజంబున ప్రకా శించు నీకాంతామణిని యీ కల్లోలమున గురుతింప జాలనైతిని క్షమింపుడు.

కుము — (ప్రాంజలియై) నాథా అపరాధిని రక్షింపుము, రక్షింపుము. (అని పాదంబుల వ్రాలును)

కామ — కాని నీమణీ అపరాధివైతివి. ప్రణవపంచాక్షరీ మంత్ర పరమాత్మ తేజంబున నిరపరాధివై లెమ్ము లెమ్ము (అని లేవదీయును)

సదా — భూచరా ఆ దివ్య తేజంబున ప్రకాశించు ఆపతివ్రతా తిలకమెవ్వరో గ్రహించితివా యీమహానుభావుని భార్య తమకోడలు గౌరీ నామధేయ (అనిచూపును)

కామ — (సంతోషముతో) తండ్రీ అటులనా (అని గౌరినిజూచి) అమ్మా మత్కుమారునిచే నలంకరింపబడిన సింహాసనమును నీవునూ అలంకరింపుము. (అని సింహాసనముచూపును)

గౌరి — చిత్తము. బసవేశ్వర సదాశివయోగివర్య మహాభక్తవరులారా నమస్కారము (అనినమస్కరించి) అత్తమామలారా నమస్కారము (అని నమస్కరించి) (భర్తనుజూచి) జీవితేశ్వరా నమస్కారము. (అని నమస్కరించి సరసనగూర్చుండును) పుష్పవర్షముగురియును)

హారతి బట్టుదురు.

'భరతవాక్యము' (సదాశివయోగి)

మ॥ మదిసందేహము లెల్లమాని ప్రణవా • త్మధ్యాన పంచాక్షరీ
సదనాంతర్గత లింగనిద్దెలశి శ • శ్వన్మోక్ష సామ్రాజ్య భా
స్వదలంకార హితార్థసిద్ధి సకలై • శ్వర్యాయు రారోగ్య సం
పదసిద్ధిఁగను చంద్రుగాక జగతి • భవప్రభావోత్తముల్॥

శ్రీ. శ్రీ. శ్రీ.

పంచమాంకము.

శ్రీ పరమేశ్వరార్పణమస్తు.

శ్రీ

శుభంభవతు.



శ్రీరామచంద్రాయ నమః.

శ్రీగురుభ్యోన్నమః.

# కొప్పరపు గోపాలకృష్ణమూర్తి గారిచే

## రచియింపబడిన (పాటలు.)



(నటి, సూత్రధారుడు ప్రవేశించుచూపోవుచూ)

శ్రీగిరిజా హృదయేశా శ్రీధరగిరిధారా నదిజారా ॥ శ్రీ। కామహారా కలుషదూరా కరివరదానుత గజచర్మాంబర॥ శ్రీ। వేదకాలయకా వృషభేశ్వరవాహకా వేదాతీతా మునిస్తుతపాదా ఖలదనుజవిభేదా ॥ శ్రీ॥ జ. కృష్ణకవిపాలా జష్ణాదిసురలోలా శ్రీ కైలాసనిలయా కోవిదవాసహృదయా॥ శ్రీ॥

(1) ఈమదవల్లి

ఈ ఉద్యానము హృదయంగముగ దనరుచునుండెను భళీ భళీ హాయి ॥ ఈ ।

చూతకేతకిశోభాంజనములు పాటలిశాండిల్య పారిభద్రంబులు। ఈ।

సాకీ। లలితపరీమళ మిళితబంధురంబై చాంపేయముఖ సర్వపుష్ప సంచయంబై గనెడువారల కన్నులకతిముద ముసుగలిగించెనీ భూవిభు నగరున । ఈ ।

(2) శంబరుడు,

ఏమనందుదీనిరుచి యెల్లరకు ననుభవేద్యము భూమిలోనద్రాగరాదని మూఢులంత కూయుదురు। ఏమ ।

చెట్టుకొక్క నిచ్చెనేసి కాళ్లకుబంధము వేసి లొట్టిగట్టి కిందదింపినట్టి కల్లు వారెవారె। ఏమ ।

కల్లుకంటె సారాయిరుచి అల్లదానికన్న బంగుబంగుకన్న కాపుసారా వారెవారె హాయ్‌హాయ్। ఏమ ।

(3) కుముదవల్లి,

దైవరాయా నీకిదీ మర్యాద న్యాయమన్యాయ మించుకలేదా। దై।
నాథునిమొడబాపి వగరూనువిడజేసి వట్టడవినన్నిటులు చెట్టలందగ
జేయ। దైవ। ఏపాపమెరుగని యీపాటుమిటుగలుగ నాపూర్వకర్మ
యని నాకిపుడు స్మృతిగల్గె। దైవ।

(4) కుముదవల్లి,

నాథా నిన్ను బాసీ యువనిబ్రతుకగలనహా। నాథా।
అగ్నిసాక్షిగా పెండ్లియాడినట్టి నన్ను సీడదగునా। నాథా।
మీారుతపము కేగనేల మారుడమ్ములుఁరువ్వనేల యెరుకవాడు డాయ
నేల నిట్టుచెట్టబుట్టనేల। నాథా।

(5) సీమంతిని,

ఎంతయాలోచనము మంతనమున జేసి వేశ్య అంతరంగ మెరుగలేరు
యువనినెవ్వరుగ। ఎంత। ఎంతధనికుడైనగానీ ఎంతపండితుండైనను
మంతనమునమ్ముగూడ చింత వేరెయుండునే। ఎం। నీటయుడుగులగ
నుగొనిన నెత్తిరోమములు గణించిన ఆటగత్తెలమనముగనుట కలవి
యగునె బూటకంబులుయెన్నియైనను నోటితోడమబల్కవచ్చును।
। ఎంత।

(6) చిక్కయ్య,

కవడములివిగో భవవార్ధిని దాటింపగ దగుపడవనదగు పవడము।
పవడములివిగో, జననమరణముల బాపుచు పరమపదము జేకూర్చు
చు ముక్తికాంతారతిగలుంగ జేయుచు శాంతిని చేకూర్చి చిత్సుఖ
మొసంగు। పవ।

(7) (లలితాంగి)

నామాదిగల యీప్రేముడిదాకగ జాలమికేలా సుకుమారా, నామ।
వీరులపాన్పుపై నెరనమ్మిననను సురతకేళిలో సుఖపడజేయుము। నా।

సాకీ॥ నవయవ్వనవిలాససుందరమై అనన్యసామాన్య దుర్లభమై వెలయు
నాతను ప్రియుడునీపద సీధియుంచితినదయహృదయ॥ నా॥

(8) చిక్కయ్య

తగునా యిటులబలా తావృసులెగతినవగ ॥ తగునా॥

మగవాలికి పరులతోడ మంతనంబు లుచితమగునా నగరేయిది యెు
రులువిన్న న్యాయమౌగన్నక ॥ తగునా॥ పంచాక్షరి మంత్రింబును
పఠనముగావించి మేనున మంచిలింగమూర్తి దాల్చి మర్యాదను వీడి
నడున ॥ తగునా॥

(9) లలితాంగి,

ఘనతనుతాపము నెటుల భాయుకునో ॥ యిూ॥ యేరీతిని మానని
తృప్తిపొగింతునో॥ యిూ॥

సాకీ॥ జాలిలేకనన్ను సంతాపజలనిధిగా దూలజేయనీకు మేలు లెటులగుగా
పాిలుమాలినిన్నుగోరి ప్రాపుజేరి యున్నానా॥ యిూ॥

(10) (చిక్కయ్య)

బాలా నాపలుకులు వినవేలా నీమాటవినగజాలా! ఇక మానుమిూ
లీలా॥ బాలా॥

వినియువినను కనియుకనదు ప్రేముడికను వెళ్లెదిసుమా దానినీమ
దినమ్మి మెలంగకుమా॥ బాలా॥ కాయములీయిలపైని కలకాలము
నిల్వబోవు నే యెడలను కీర్తియొందు యేనిలుచును నిక్కవముగ ॥
॥ బాలా॥

(11) (లలితాంగి)

దూతమతీ నీగతి నీకును చెప్పెదనురా పొగరుననువిడి పోవుదువా
॥ దురిత॥ సతులను ప్రేముడి గనుగొనకను యీ గతిగా ధిక్కరణం
బొనరింపగా దలచివెలగినాడవింక తరలుమునీ పనిబట్టెద॥ దురిత॥

---

# విజ్ఞప్తి

గుంటూరు, కర్నూల్, నెల్లూరు జిల్లాలకు పట్టాపొంది నరసరావుపేట రైల్వేస్టేషను సమీపమున మ. రా. రా. ప్రత్తిపాటి శేషయ్యగారికుమారుడు వెంకటసుబ్బారావు పంతులుగారు నూతనముగా బి. యల్. (ప్లీడరు) పరీక్ష ప్యాసుఅయి ఆఫీసు స్థాపించి యున్నారు. మీరు మీ క్రిమినల్, సివిల్, రివిన్యూ వ్యవహారములు వారివద్ద జరిగించుకొన వలయునని ప్రార్థన.